THE ANDHRA PATRIKA, MADRAS.



# ఆంధ్రపత్రిక

3180 24





Regd. No. M, 1118 సంపుటం 38. సంచిక 91 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. సోమవారం 2-7-1951 వెల 1 అణా.

# ఆగ్నేయ ఆసియా ఆర్థిక అభివృద్ధి సాధనకు సమష్టి కృషి ప్రారంభం

## పర్షియా నూనె తగాదాపై హేగ్ కోర్టు విచారణ

### సత్వరచర్య తీసుకోవాలని బ్రిటన్

హేగ్, జూన్ 30: పర్షియా నూనె జాతీయకరణ శాసనం అక్రమమని తాను లోగడ చేసినఫిర్యాదుపై నిర్ణయం జరిగేవరకూ ఎటువంటి చర్యలను తీసుకోకుండా పర్షియాను నిరోధించవలెనని బ్రిటన్ పెట్టుకున్న దరఖాస్తుమీద నేడు అంతర్జాతీయ న్యాయస్థానం విచారణ ప్రారంభించినది. తమ దరఖాస్తును సమర్థించుకుంటూ బ్రిటిష్ ఎటార్నీ జనరల్ సాస్కిన్ నేడు అయిదు గంటలసేపు వాదించారు.

బ్రిటిష్ ప్రతినిధి తన వాదాన్ని ప్రారంభించటానికి ముందు, పర్షియా ఈ న్యాయస్థానానికి నిర్ణయాధికారం లేదని అభిప్రాయ పడుతున్నదని విదేశాంగమంత్రి కాజమీ ఒక సందేశాన్ని ...

(2-వ పేజీ చూడుడు)

## వివిధ ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుల సమావేశం

### జూలై 14 న జరుగుతుందని ఎ. ఐ. సి. సి. ప్రకటన

న్యూఢిల్లీ, జూన్ 30: వివిధ ప్రదేశ కాంగ్రెసు సంఘాల అధ్యక్షుల సమావేశమొకటి బెంగుళూరులో జూలై 14 వ తేదీనాడు ఉదయం ఎనిమిది గంటలకు జరుగుతుందని యిక్కడి ఎ. ఐ. సి. సి. కార్యాలయంవారు నేటి దినం ప్రకటించారు.

కేంద్ర ఎన్నికల సంఘంవారు తమ మొట్టమొదటి సమావేశాన్ని బెంగుళూరులో ఎ. ఐ. సి. సి. సభలు జరిగే సమయంలో నేజరుపదలచుకొన్నారు.

కాంగ్రెసు కార్యవర్గ సమావేశం జూలై 10-వ తేదీనుంచి జరుగుతుంది.

ఎ. ఐ. సి. సి. సమావేశం జూలై 13-వ తేదీ మధ్యాహ్నం 2 గంటలకు ప్రారంభమవుతుంది.

## 15 దేశాల్లో కొలంబో పథకం అమలు

### ఆరు సంవత్సరాల్లో అరవై లక్షల టన్నుల ఆహార ధాన్యాన్ని అదనంగా పండించడానికి ఏర్పాటు

లండన్, జులై 1: కొలంబో పథకాన్ని నేడు 15 రాజ్యాలు అధికారికంగా అమలులో పెట్టాయి.

1950 జనవరిలో కొలంబోలో, జరిగిన కామన్‌వెల్తు రాజ్యాల సమావేశంలో ఈ పథకం ప్రాదుర్భవించింది. దక్షిణ, ఆగ్నేయ ఆసియా రాజ్యాలఅభివృద్ధికిఈపథకం లక్ష్యం.

ఈ పథకం జీవితం 6 సంవత్సరాలు, ఇందు నిమిత్తం ఈ కాలంలో ఖర్చు అయ్యే మొత్తం 1868 మిలియన్ల స్టెర్లింగులు.

ఈ పథకంయొక్క మూల లక్షాలు ఇవి (1) సాగుబడి క్రిందను, ఈ ఆరు ఏండ్లలో 13 మిలియన్ల ఎకరాలను అదనంగా తీసుకురావాలి. (2) 13 మిలియన్ల ఎకరాలకు తగిన నీటివసరు ...

(2-వ పేజీ చూడుడు)

## కమ్యూనిస్టుల జవాబుకు సమితి వర్గాల నిరీక్షణ

### యుద్ధ విరమణ విషయమై చైనా - రష్యా సంప్రతింపులు

టోకియో, జూన్ 30: యుద్ధవిరమణ విషయం చర్చించడానికి ప్రతినిధులను పంపించవలసిందని కోరుతూ కొరియాలోని ఐక్యరాజ్యసమితి సర్వసేనాని జనరల్ మాథ్యూ రిడ్జ్వే పంపిన సందేశానికి ఉత్తరకొరియా సర్వసేనానివద్దనుంచి సమాధానం ఎప్పుడు వస్తుందో అని కొరియాలోని ఐక్యరాజ్యసమితి ప్రధాన సైనికాధికారులు ఆతురతతో నిరీక్షిస్తున్నారు.

కాని సమాధానం ఏమి పంపాలి అనే విషయమై పెకింగు, ప్యాంగ్యాంగ్ మాస్కో ఈ మూడు రాజధానులమధ్య పరస్పర సంప్రతింపులు జరగవలసి వుంటుంది. కనుకనున్నూ ఈ నగరాలమధ్య వార్తా సౌకర్యాలు కూడా సరిగాలేని కారణం చేతనున్నూ, ఉత్తరకొరియా సర్వసేనానివద్దనుంచి రిడ్జ్వే కార్యాలయానికి ప్రత్యుత్తరం రావటానికి బహుశా రెండు మూడు రోజులు పట్టవచ్చునని చాలామంది అభిప్రాయ పడుతున్నారని 38వ అక్షాంశరేఖకు ఎగువగా వున్న వోన్సాన్ రేవులో జట్లాండియా అనే డేనిష్ నౌకమీద యుద్ధ విరమణ విషయమై సంప్రతింపులు జరిపేందుకు ప్రతినిధులను పంపవలసిందని జనరలు రిడ్జ్వే ఉత్తర కొరియా సర్వసేనానీ ప్రధాన మంత్రి అయిన మార్షల్ కిమ్ ఇల్ సంగ్‌కు తాను పంపిన సందేశంలో సూచించి వున్నాడు.

పైన చెప్పిన జట్లాండియానౌక ప్రస్తుతం పూసాన్ రేవులోవుంది. యుద్ధంలో క్షతగాత్రులైనవారిని తీసుకువచ్చి చికిత్స చేయటానికి స్థలాంతరాలకు చేరవేయడానికి ఈనౌక ఉపయోగించబడుతోంది. ఉత్తర కొరియా సర్వసేనానికి జనరల్ రిడ్జ్వే సమాధానం పంపిన మరుక్షణంలోనే ఈనౌకలోని క్షతగాత్రులను వేరే చోటికి మార్చించి, నౌకను వోన్సాన్ ప్రయాణానికి ...

... సన్నద్ధంచేసివుంచారు. నౌక పూసాన్‌నుంచి వోన్సాన్ వెళ్లాలంటే, 24 గంటలకంటే ఎక్కువసేపు పట్టదు. ...

... వానఫ్లీట్ వెంట తీసుకొని వెళ్లవచ్చునని అనుకుంటున్నారు.

### 16 రాజ్యాల ప్రతినిధుల సమావేశం

వాషింగ్టన్, జూన్ 30: కొరియా యుద్ధంలో పాల్గొంటున్న 16 మిత్రరాజ్యాల ప్రతినిధులు అమెరికా విదేశాంగ కార్యాలయంలో నిన్న సాయంత్రం సమావేశమైనారు. కమ్యూనిస్టు సర్వసేనానికి జనరల్ రిడ్జ్వే పంపిన సందేశపాఠాన్ని వీరుచర్చించి ఆమోదించినట్లు తెలుస్తున్నది.

యుద్ధవిరమణ సంప్రతింపులకు ఉపక్రమణికగ ఈక్రింది షరతులు విధించవలసిందని జనరల్ రిడ్జ్వేకి ఉత్తర్వు చెయబడినట్లు తెలుస్తున్నది.

ఒకటి, 38 అక్షాంశరేఖ ఎగువను 20 మైళ్ళ వెడల్పున తటస్థప్రాంతం ఏర్పాటు చెయ్యాలి. రెండు, యుద్ధ విరమణ పర్యవేక్షణకు అంతర్జాతీయ కమీషన్‌ను నియమించాలి. ఈ కమీషన్‌ను కొరియాఅంతటా యథేచ్ఛగా తిరగనివ్వాలి.

### ట్రిగ్వేలీ ప్రసంగం

ఐక్యరాజ్యసమితి,జూన్ 30: ఐక్యరాజ్యసమితి కార్యదర్శి ట్రిగ్వేలీ ఈవేళ యిక్కడ రేడియోలో ప్రసంగిస్తూ "కొరియాలో యుద్ధవిరమణకాంక్షి మొదటి మెట్టుమాత్రమే అనీ, యుద్ధవిరమణానంతరం జరగవలసిన రాజకీయ రాయబారాలు బహుజటిలమై, దీర్ఘకాలానికిగాని ఒక పర్యవసానానికి ...

(2-వ పేజీ చూడుడు)

## ఆంధ్రప్రజాపార్టీలో చీలిక

### యుద్ధవిరమణ ఒడంబడిక షరతులు

వాషింగ్టన్, జూన్ 30: జనరల్ రిడ్జ్వే సందేశానికి కమ్యూనిస్టుల వద్దనుంచి సమాధానం వచ్చినతర్వాతగాని యుద్ధవిరమణ ఒడంబడిక షరతులు ఏవిధంగా వుండాలి అనే విషయమై మిత్రరాజ్యాలు అంత్య నిర్ణయం చేయుదలచుకోలేదని ఈవేళ యిక్కడ తెలియవచ్చింది.

కాని ఈ సందర్భంలో ఈ క్రింద చెప్పిన పథకం ఒకటి మిత్రరాజ్యాల ప్రతినిధుల పరిశీలనలో వున్నట్లున్నూ అంతిమంగా నిర్ణయించే యుద్ధ విరమణ షరతులు ముప్పాతిక మూడు పాళ్లు ఈ పథకాన్ని అనుసరించే వుంటాయనీ విశ్వసనీయంగా తెలుస్తున్నది. ఈ పథకంలోని షరతులు ఇవి:

ఒకటి, యుద్ధవిరమణ ఒడంబడిక అమలులో వున్నంతకాలం ఉభయపక్షాల కమాండులకు ఏవిధమైన ముప్పు రాకుండ సురక్షితంగా వుంటేటట్లు హామీలు ఇవ్వాలి.

రెండు, 38వ అక్షాంశరేఖ సమీపంలో 20 మైళ్ల వెడల్పున తటస్థ ప్రాంతం ఏర్పాటు చెయ్యాలి.

మూడు, కొరియాలోకి అదనపు ...

### ప్రకాశం-రంగాగార్ల మధ్య తీవ్ర అభిప్రాయభేదాలు

విజయవాడ, జులై 1: ఆంధ్రప్రజాపార్టీ కార్యవర్గము ఇవ్వాళ పశ్చిమకృష్ణా ప్రజాపార్టీ కార్యాలయంలో శ్రీ ప్రకాశం పంతులుగారి అధ్యక్షతను సమావేశమై ఆంధ్రప్రజాపార్టీని రద్దుచేసి కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీకి అనుబంధ సంబంధ సంస్థగచేరిపోవాలనే" ప్రతిపాదనపై రెండు గంటలు చర్చించి మరల రాత్రి సమావేశమై చర్చించుటకు వాయిదా వేశారు.

నిన్నటినుండి విజయవాడలోనే వుంటూవున్న శ్రీ యన్. జి. రంగాగారు సమావేశానికి హాజరుకాలేదు. ఊర్లోవుండికూడా బుద్ధిపూర్వకంగా సమావేశానికి రంగాగారు హాజరుకాలేదని కొంతమంది సభ్యులు అనుకుంటూవున్నారు.

రంగాగారు బుద్ధిపూర్వకంగానే సమావేశానికి హాజరు కాలేదనియు, కిసాన్ మజ్దూర్ పార్టీకి, రంగాగారికి మూలసూత్రాలలోనే అభిప్రాయభేదాలున్నాయని శ్రీ గౌతు లచ్చన్నగారు చెప్పినట్లు తెలుస్తోంది.

ఆంధ్రప్రజాపార్టీ వేమరతుగా రద్దు అయి కిసాన్ మజ్దూర్ పార్టీకి అనుబంధసంస్థగా మారిపోవాలని ప్రకాశంగారూ, ఆంధ్రప్రజాపార్టీ స్వతంత్ర ...

... చరులను తప్పించుటకు ప్రయత్నిస్తారని అనుకుంటున్నారు. ఈ ప్రయత్నంలో విఫలమైనా ప్రకాశంగారు పాట్నా తీర్మానమును అనుసరించుటకు పూనుకొంటారని అనుకుంటున్నారు.

శ్రీ యన్. శంకరరెడ్డి, కె. సూర్యనారాయణ, కందుల ఓబులరెడ్డి, కె. లింగరాజు, వడింపల్లి నరసింహారావు, వడింపల్లి రామభద్రరాజు, బి. సుబ్బారాజు ప్రకాశంగారి తరఫునూ, శ్రీ సి. విద్యాసాగర్, గౌతు లచ్చన్నగార్లు రంగాగారి తరఫున ప్రచారము చేస్తూవున్నట్లు తెలుస్తోంది.

... శ్రీ ప్రకాశం పంతులుగారు రాత్రి సమావేశం అయినప్పుడు కిసాన్ మజ్దూర్ పార్టీ తీర్మానమును ఖచ్చితంగా అమలుజరగాలని పట్టుబట్టే అను...

### విజయవాడకు అశోక్ మెహతా రాక

విజయవాడ, జులై 1: సోషలిస్టు నాయకుడు శ్రీ అశోక్ మెహతా జులై 18వ తేదీన విజయవాడ వస్తారు.

### వేరుశెనగపప్పు ఎగుమతి పన్ను హెచ్చింపు

న్యూఢిల్లీ, జూన్ 30. వేరుశెనగపప్పు ఎగుమతిపన్నును టన్నుకు 80 రూపాయలనుండి 150 రూపాయలకు ...

... కొనుటకు ఇచ్చిన దిగుమతి లైసెన్సులలో జూన్ 30 తేదీని అంతమయ్యే లైసెన్సులు జులై 31 తేదీ వరకు చెల్లుతవని భారత ప్రభుత్వంవారు ప్రకటిస్తున్నారు.

### దిగుమతి లైసెన్సుల కాలం పొడిగింపు

## సోమవారంనాడు ఢిల్లీకి డా॥ గ్రహాం ఆగమనం

కరాచీ, జూన్ 30: కాశ్మీర్ మధ్యవర్తి డా॥ ఫ్రాంక్ గ్రహాం నేడు పాకిస్తాన్ ప్రధాని లియాఖతాలీఖాన్‌ను, విదేశాంగ మంత్రి జఫ్రుల్లాఖాన్‌ను వేరువేరుగా కలుసుకొని చెరి ఒకగంటసేపు సమాలోచనలు జరిపారు.

డా॥ గ్రహాంతోపాటు ఈ సమావేశాలలో ఆయన కార్యదర్శి పెట్రసుపిస్టట్, సలహాదారుడు మిస్యుయల్ మారిన్, సైనిక సలహాదారుడు జోకబ్ డేవర్స్ పాల్గొన్నారు.

డా॥ గ్రహాం సోమవారంనాడు ఇచ్చటి నుండి బయలుదేరి న్యూఢిల్లీకి పోతున్నారు. ఢిల్లీలో ఆయన రెండు మూడురోజులువుండి పాకిస్తాన్‌లో లియాఖత్‌ను కలుసుకున్నట్లే ఇచ్చట నెహ్రూను కలుసుకుంటారు.

అచ్చటినుండి ఆయన శ్రీనగర్‌కు పోయి, కొన్ని వారాలపాటు అచ్చట గడుపుతారు. శ్రీనగర్‌లోనే ఆయన తన ప్రధానకార్యాలయాన్ని కూడా ఏర్పాటు చేసుకుంటారు.

### జర్మనీ - భారతదేశ వాణిజ్య ఒడంబడిక

బోన్, జూన్ 30: భారతదేశము పశ్చిమ జర్మనీ చేసికొన్న వాణిజ్య ఒడంబడిక జూన్ 30 తేదీతో అంతమగుచున్నది. ఈఒడంబడిక కాలమును యింకా నాలుగునెలలు, అనగా అక్టోబరు అంతమువరకు పొడిగింప భారతదేశము, ప. జర్మనీ సమ్మతించినవి. ఈ ఒడంబడిక ననుసరించి భారతదేశము ప. జర్మనీకి 270 లక్షల డాలర్ల సరుకులు ఎగుమతిచేయును. జర్మనీ కూడా భారతదేశానికి 270 లక్షల డాలర్ల సరుకు ఎగుమతిచేస్తుంది. క్రమేణ ఈ వాణిజ్యం వృద్ధి అవుతుందని ఒక భారత అధికారి చెప్పెను.

## థాయిలాండ్ ప్రధానమంత్రి విడుదల

### అమెరికా విదేశాంగ శాఖ ప్రకటన

వాషింగటను, జులై 1: తిరుగుబాటుదార్లు ప్రధానమంత్రి సాంగ్రామును విడిచిపెట్టిరనియు ఆయన తిరిగి ప్రభుత్వ వ్యవహారములను చూచుకొనుచున్నాడనియు అమెరికా ప్రభుత్వ విదేశాంగశాఖవారికి గతరాత్రి వార్త వచ్చింది. పిబుల సాంగ్రామును ఏమరతులూ లేకుండా విడిచిపెట్టినారనీన్నీ పోరాటం క్షీణించినదనీన్నీ వార్త వచ్చిందట.

### సయాం ప్రభుత్వ పోలీసు శాఖ ప్రకటన

... మునకు చెందినవారు. 1947 సం॥లో పదవినుండి త్రోసివేయబడిన ప్రిడీగారు తిరిగి ప్రధానమంత్రిగా రావలెనని యీ నౌకాదళ సైనికుల కోరిక. ప్రిడీగారు ఇదివరలో చైనా కమ్యూనిస్టులతో ఎక్కువ సంపర్కము కలవారు.

బంధించబడిన ప్రధానమంత్రి నిపిబుల సంగ్రామును విడుదలచేయుటకు నేటి సాయం కాలంవరకు గడువు యివ్వబడింది. ఆయనను విడుదలచేస్తే రాజీపద్ధతికి వస్తామని కొల్పల సైనికాధికారులు ప్రకటించిరి. నౌకాదళంవారు ప్రధానమంత్రి భవనముపై షెల్లులను కాల్చిరి. ఏమాత్రం నష్టం కలిగిందో తెలియదు.

... తప్పించుకొనిరనే వార్త నేటిరాత్రి వ్యాపించింది. కాని ప్రభుత్వాధికారుల ద్వారా వార్త లేదిన్నీ ప్రకటింపబడుటలేదు. గనుక యీ వదంతి నమ్మదానికి వీలులేదు.

తిరుగుబాటుదార్లు కొత్త ప్రభుత్వవర్గం ఏర్పాటు చేసినట్లుగా ప్రకటించుచు వారి ప్రభుత్వవర్గంలో ఈనజ్ సినాల్యూను రక్షణకు, స్వదేశాంగ మంత్రిగాను, సేనాధిపతిగా లెస్టినెంటు జనరలు లవంగ వీరయోనగారును, నియమింపబడినట్లుగా ప్రకటింపబడెను.

చాసూ ప్రయానదీ ప్రాంతంవద్ద నేపోరాటం ఎక్కువగా జరుగుతోంది సమాధాన సమాలోచనలు జరుపుకొనుటకై తిరుగుబాటుదార్లు తమ ప్రతినిధిని పంపవలెనని కొల్పల సైనిక రేడియో ...

## కలకత్తా-హాంకాంగ్ విమాన సర్వీసు

### భారత ఎయిర్‌వేసు వారికి లైసెన్సు

న్యూఢిల్లీ, జూన్ 30: కలకత్తా-రంగూన్ - బాంకాక్ - హాంకాంగ్ మార్గంలో విమానాలు నడపడానికి ట్రాన్స్‌పోర్టు లైసెన్సింగ్ బోర్డువారు నేడు భారత ఎయిర్‌వేసుకు ఆరు మాసాలవరకు లైసెన్సు యిచ్చారు. ఇతర దేశాలలో విమానాలు నడపడానికి ఈ కంపెనీవారు యితరదేశ ప్రభుత్వాల అనుమతి పుచ్చుకొనవలసియుండురు. ఈ సర్వీస్ ఎప్పుడు ప్రారంభం అవుతుందో ఆ రోజున ఈ లైసెన్సు అమలులోనికి వస్తుంది. రంగూన్‌నల్లే వారిని కలకత్తాలో ఎక్కించుకోడానికి కలకత్తానుండి వారినిరంగూనులో ఎక్కించుకోడానికి ఈ కంపెనీకి హక్కులేదు.

కలకత్తా- మోహన్‌బారీ (అసామ్ డిబ్రుఘర్ దగ్గరవున్న) సరుకులు చేరవేయడానికి, కలకత్తా - అలహాబాదు- అహమ్మదాబాదు మార్గమున ప్రయాణీకులను చేరవేయడానికి హిమాలయన్, ఏవియేషన్ లిమిటెడ్ కంపెనీకి లైసెన్సులు యిచ్చారు.

గౌహతి- బగ్‌డోగ్రా ప. బెంగాలు డార్జిలింగ్ క్రిందవున్న పాట్నా ...

## కాశ్మీర్లో యుద్ధవిరమణ సరిహద్దు మీదుగా పాకిస్థానీ దుండగాలు

### సమితి సైనిక పరిశీలకులతో జనరల్ కరియప్ప సమాలోచనలు

శ్రీనగర్, జూన్ 30: కాశ్మీర్‌లో యుద్ధవిరమణ సరిహద్దుమీదుగా పాకిస్తానీలు దాడులను గూర్చి సమితి సైనిక పరిశీలకులతో చర్చించే నిమిత్తం భారతసర్వసేనాని జనరల్ కరియప్ప నేడు ఇచ్చటకు వచ్చారు.

ఈ దాడులనుగూర్చిన వివరాలు నేడే ప్రకటితము లైనాయి. జూన్ 25 వ తేదీనాడు పాకిస్తానీలు కొంతమంది లాఠీలతో, కత్తులతో, యుద్ధవిరమణ సరిహద్దునుదాటి, దానికి 20 మైళ్లు ఈవలగావున్న ప్రతి, మహాం ...

... లోచించారు. ఈ సమాలోచనలు సౌహార్ద్రపూర్వకంగా జరిగినట్లు ప్రకటింపబడింది.

జనరల్ కరియప్ప శ్రీ నగర్‌లో దిగగానే కొంతమంది పత్రికా విలేఖరులు ఆయన్ను కలుసుకొన్నారు. పాకిస్తానీలు యుద్ధవిరమణ సరిహద్దును దాటి ఈ విధంగా చేస్తున్న దాడులను గూర్చి పూర్తి సమాచారం సేకరించడానికి నేను ఇచ్చటకు వచ్చాను. కటిని ప్లుదలులోనే త్రుంచివేయా ...

# కౌలుదార్లకు ప్రత్యేక రక్షణ

## భూసంస్కరణల సంఘ శిఫార్సులు

## 'స్వయంగా సాగుచేయకపోతే భూమివుండదు'

మదరాసు, జూలై 1: మదరాసు ప్రభుత్వమువారు నియమించిన భూమి సంస్కరణల నివేదిక ప్రచురింపబడినది. (కొన్ని ముఖ్యమైన శిఫార్సులను ఆంధ్రపత్రిక నిన్ననే ప్రకటించింది.)

భూమి సంస్కరణల సంఘంవారు 126 శిఫార్సులు చేశారు. అధ్యక్షుడు గాక కమిటీ సభ్యులు 7 గురిలో శ్రీ ఆబ్లూరి సత్యనారాయణరాజుగారు సమావేశములకు హాజరుకాలేదు. రిపోర్టుపై సంతకం చేయలేదు. 8 సమావేశములలో 31 రోజుల చర్చ అనంతరం నివేదిక తయారయింది. చాలా విషయాలు మెజారిటీ ఓటుతో నిర్ణయించారు. ఈ నివేదిక తయారుచేయు సందర్భమున శ్రీ రాఘవేంద్ర రావు నివేదికను, కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల కమిటీవారి నివేదికను సమగ్రంగా పరిశీలించారు.

శిఫార్సుల సారాంశం:-

రైతు స్వామ్యం ఈ రాష్ట్రప్రజల సాంప్రదాయమునకు అనుకూలంగా వుంటుంది. భూమి చిన్న చిన్న ఖండములుగ వుండుటవల్ల నష్టకష్టము లున్నవి గనుక ఇంకా భూమి చిన్న విభాగములు కాకుండానూ, చిన్న చిన్న ఖండములను ఏకీకరణ చేయుటకు తగు చర్యలు తీసుకొని ఏదో ఒకరకమైన సహకార వ్యవస్థ క్రిందికి తీసుకొని రావాలి.

ప్రస్తుతపు భూవసతికి గరిష్ట ప్రమాణము నిర్ణయించవలసిన అవసరంగాని గరిష్ట ప్రమాణమునకు మించిన భూమిని వశపరచుకొన అవసరంగాని లేదు.

ఐతే ఇకముందు ఏవ్యక్తికీ రు.250ల లకు మించి భూమిశిస్తు చెల్లించే భూమి వుండరాదు. సమష్టి కుటుంబాలకు వెయ్యి రూపాయలశిస్తు చెల్లించే భూమి వుండుటకు అనుమతించవచ్చును.

గరిష్ట ప్రమాణమునకుమించి భూమి కలిగి వుండుటకు అనుమతించబడిన ఏ భూస్వామి అయినా నిర్ణీత తేదీ తరువాత కొంతభూమిని విక్రయించే ఎడల సదరు భూస్వామికి అదనపు భూమి వుంచుకొనే అవకాశం రద్దు అవుతుంది. అయితే కొంత అమ్మిన తరువాత భూవసతి గరిష్ట ప్రమాణము కన్న తగ్గినచో ఆ లోటువరకు భూస్వామి భర్తీచేసుకోవచ్చును.

గరిష్ట ప్రమాణమునకు మించి భూములు సంపాదించిన అదనపు భూమిని పరిహారము లేకుండా తీసుకొనవలెను. లాండ్ ట్రిబ్యునల్ కేసులను విచారించి పరిష్కరించెదరు. ఈ కట్టుబాట్లు మతదాన ధర్మములకు, విద్యా సంస్థలకు; సహకార సంఘములకు వర్తించవు.

కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల సంఘంవారు సూచించిన గిట్టుబాటు భూవసతి అనేది ఆచరణ యోగ్యము కాదనియూ, ఆ విషయమై విచారణ జరిపించ నవసరములేదు. అయితే కనీస భూవసతిని నిర్ణయించుటకు కొన్ని ఎంచబడిన ఫిర్కాలలో పరిశీలన జరిపించవచ్చును. కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల సంఘంవారు అభిప్రాయ పడినట్లు కనీసవసతి నిర్ణయించుటకు పూనుకొన నవసరములేదు.

"రైతు" అంటే (1) స్వతంత్రంగా కష్టపడి పాటుపడే వ్యవసాయము చేయువారు (2) కుటుంబములోనివారిచేత వ్యవసాయం చేయించేవారు (3) పంటలో వాటా లేకుండా కూలివాళ్లకిచ్చి వ్యవసాయం చేయించుకొనేవారని నిర్వచించుకోవచ్చునని సూచించారు. ఆడవాళ్లు, మైనర్లు, స్వతంత్రంగా అజమాయిషీ చేసుకొనే శారీరక, మానసిక శక్తి లేనివారు నౌకర్లచే కూలిఇచ్చి వ్యవసాయం చేయించుకున్నా స్వతంత్రంగా వ్యవసాయముచేయు రైతుల క్రిందికే వస్తారు. సమష్టి కుటుంబంలో కుటుంబంలోని ఎవరు సాగుచేస్తూవున్నా స్వతంత్రంగా వ్యవసాయం చేస్తూవున్నట్లే.

జాయింటుస్టాకు కంపెనీలో, భాగస్వాములుగ చేరువారు, ధర్మసంస్థలు, మతసంస్థలు, సహకార సంఘములను "రైతు" అనే నిర్వచనంనుండి మినహాయించారు.

పై నిర్వచనంక్రింద రైతులు కానివారికి అన్యాక్రాంతములను నిషేధించాలి. అయితే మూడు సంవత్సరములలోగా స్వంతవ్యవసాయం చేసే షరతుమీద కలెక్టరు సర్టిఫికెట్‌తో భూమి కొని రైతులు గావచ్చును.

వ్యవసాయ కూలీలు ఎప్పుడుపడితే అప్పుడు భూమిని సంపాదించుకోవచ్చును. వ్యవసాయకూలీ అంటే ఎవరో స్పష్టంగా తేల్చాలి.

గిట్టుబాటు వసతి ప్రమాణమునకు తగ్గకుండ విభాగములు చేయుటను నిషేధించుటకూ చిన్న చిన్న ఖండములను ఏకీకరణము చేయుటకు అవసరము శాసనము చేయాలి.

ప్రభుత్వము సహకార వ్యవసాయాభివృద్ధి సంఘములను ప్రోత్సహించాలి. ప్రదర్శనము పరిశోధనలనుతప్ప "ప్రభుత్వ వ్యవసాయం" అనుసరించ తగింది కాదు. సమష్టి వ్యవసాయం గురించి ఆలోచించ నవసరములేదు. అయితే గ్రామంలో కలిసి మేము సమిష్టి వ్యవసాయం చేసుకుంటామంటే, ప్రోత్సాహం ఇవ్వవచ్చును. సహకార వ్యవసాయాభివృద్ధి సంఘములతోపాటు సహకార సమష్టి వ్యవసాయమును ప్రోత్సహించవచ్చును.

కట్టుబడులు, కవులు గ్యారంటీ, మరమ్మత్తులు మొదలగు విషయాలకు సంబంధించిన షరతులకులోబడి భూస్వామి కవులుదారీ విధానమువుండవచ్చును.

"కౌలుదారు" అంటే, స్వతంత్రంగా వ్యవసాయం చేయని వారికి చెందిన భూమిని సాగుచేసేవారని అన్నారు. వారందార్లు, వరుంపట్టాదార్లు కవులుదార్ల క్రిందికి వస్తారు.

రైతువారీ ఏరియాలలో కవులుదార్లకు జిరాయితీహక్కు నివ్వనవసరం లేదు.

స్వంత వ్యవసాయమునకు పరిమితి నిర్ణయించినందున భూములను కౌలుకు ఇచ్చే భూస్వాములమీద సర్‌చార్జీ వేయనవసరంలేదు.

ప్రభుత్వము కట్టుబడులను శాసనం ద్వారా నిర్ణయించాలి. కట్టుబడులను మొత్తంపంటమీద నిర్ణయించుట సరియైనపద్ధతి.

కట్టుబడుల గరిష్టప్రమాణములను శాసనంద్వారా నిర్ణయించాలి. తగాదావచ్చినప్పుడు ప్రభుత్వమువారు నియమించే ట్రిబ్యునల్సు న్యాయమైన కట్టుబడిని నిర్ణయిస్తారు.

### కట్టుబడుల నిర్ణయం

పంటల ననుసరించి భూస్వామికి రయితుకు ఉండవలసిన కట్టుబడుల విభాగం గరిష్టప్రమాణం యీ దిగువరీతి నుండవలెను:—

1 వ తరగతి వసతిగల భూములకు— ధాన్యం భూస్వామిభాగం నూటికి 45—కౌలుదారుభాగం—55.

2 వ తరగతి నీటివసతిగల భూములకు 40-60 నీరు తోడవలసినచోట్ల భూస్వామిభాగం 1/3 వరకు తగ్గవచ్చును.

మెరక భూములందుగాని పల్లం భూములందుగాని పండించే వాణిజ్య పంటలకు భూస్వామికి 40—కౌలుదారునకు 60. (పసుపు, చెరకు, అరటి, ఉల్లి, వేరుశెనగ, ప్రత్తి, తమలపాకులు——వాణిజ్యపంటలుగా యిందు నిమిత్తమై నిర్ణయించెరు.)

ఇతరపంటలు- మెరకలోగాని పల్లంలోగాని — 40 — 60. ఈ సరసమయిన కట్టుబడులస్కీము కొబ్బరి, మామిడి, నిమ్మ వగయిరా పండ్లతోటలకు వర్తించదు. ఏ పొలమందయిన పెక్కు పంటలు పండించినచో అన్నిటికి కలిపి మొత్తానికి యీ భాగం వర్తించును,

నాము పంట (కాని (కాపు) పల్లం భూములందు పండేది యిప్పటివలెనే కౌలుదారులకు పూర్తిగ విడిచిపెట్టాలి. కొచ్చికాపు అనగా యేది అను విషయమున తగవు వచ్చినపుడు లాండు ట్రిబ్యునలు నిర్ణయం ఉభయులు అంగీకరించాలి.

గడ్డి కౌలుదారునకు చెందును. పన్నులన్నీ భూస్వామి కట్టుకోవాలి. సాగు ఖర్చులన్నీ పశువులు పరికరాలువిత్తులు ఎరువులకు ఖర్చులు కౌలుదారు భరించాలి. మార్పులుంటే పార్టీలు సర్దుకోవాలి. తగవుంటే లాండు ట్రిబ్యునలు పరిష్కరించును. మొత్తం పంట, అనగా కొన్ని ప్రాంతాలందు ఆచారంగా నున్నట్లు కోతల ఖర్చులకు మినహాయించి మిగిలిన పంటకాక, పొలంలో పండినపంట అంతాయని అర్థం.

సరసమయిన కట్టుబడులు నిర్ణయించు అధికారులు యీ దిగువ విషయాలుగమనించాలి:—స్థానికంగానున్న కట్టుబడుల విలువలు, వ్యవసాయ ఖర్చులు, స్థానిక వస్తువుల ధరలు, భూస్వామిగాని కౌలుదారుకాని చేసిన మరమ్మత్తు ఖర్చులు, అసెస్మెంటు మున్నగునవి.

సరకు రూపంలో కట్టుబడిభాగం పుచ్చుకొనుటకు వరందారులు దాన్ని నగదుగా మార్చి పుచ్చుకోరాదు. సరకు రూపంగా స్థిరమొత్తం చెల్లించు కౌలుదారులుకూడా దాన్ని నగదుగా మార్చి యివ్వరాదు.

కౌలుకాలంలో ధరలు మారినా నగదు కౌలు నిర్ణయించుకొన్నవారి మొత్తం మారదు. విపరీతంగా ధరలు మారినచో కట్టుబడులరేటు నిర్ణయం మార్పు, ఫలితంబట్టి ఉభయుల అంగీకారంపై మార్చవచ్చు.

కట్టుబడి బాకీలపైన, అడ్వాన్సుల పైన వడ్డీ నూటికి 6 కన్న మించరాదు.

పంటలు కొంతగాని,నగదుగాని చేసే నప్పుడు, ప్రభుత్వంవారు నిర్దేశించిన ఫారము మేరకు భూస్వామి కౌలుదారునకు రసీదును యివ్వాలి.

కౌలుదారులు భూస్వామికి వట్టి చాకిరీచేయుట, వారికోళ్లు, కూరలు మున్నగునవి ఉచితంగా యిచ్చుట, నెయ్యి, కోళ్లు, కాయగూరలు, గడ్డి ఉచితంగా భూస్వామికి యిచ్చుట నిషేధించాలి.

భూస్వాములు తమకు రావలసిన కట్టుబడికి మించి వసూలు చేసినచో దాని వాపసుచేయుటయేగాక, [illegible] లాండు ట్రిబ్యునలు నిర్ణయించ వచ్చును.

సరసమయిన కట్టుబడి నిర్ణయించు అధికారం లాండు ట్రిబ్యునలుకు వుండును. రివిన్యూ డివిజనలు ఆఫీసరు, భూస్వాముల ప్రతినిధి, కౌలుదారు ప్రతినిధి,వ్యవసాయ కూలీల ప్రతినిధి యిందు ట్రిబ్యునలు సభ్యులుగ నుంటారు. శిస్తుబాకీల వసూలు కేసులను మాత్రం వీరు విచారించరు.

ఈ కట్టుబడి నిర్ణయం స్కీము, భూస్వామి కౌలుదారు సంబంధం నిర్ణయ విధానము సహకార సంస్థలక్రింద సాగుచేయు భూములకు, సదరు సంఘాల సభ్యులకు వర్తించవు. సహకార సంస్థల సభ్యులకు సంబంధించిన నియమాలు బైలాసులో నుండును.

భూస్వాములవద్దనుండి సహకార సంస్థలు మొత్తంగా భూములు తీసుకొని సభ్యులచే సాగుచేయించునప్పుడు, సదరుసంస్థ "కౌలుదారు"గా ఎంచబడి కౌలుదారులకుండే హక్కులన్నీ పొందవచ్చును.

ఇకముందు కవులువ్యవధి కనీసం 5 సంవత్సరాలు వుండాలి. కొత్త సాగు లయితే కవులు కాలము కనీసం 10 సంవత్సరాలు వుండాలి. కవుళ్లు రిజిస్టరు కావలసిన అవసరంలేదు కాని వ్రాతపూర్వకంగా వుండాలి.

భూస్వామికి ఇష్టం లేకపోయినా కవులుదారు సాగు చేస్తానంటే కవులును తిరిగి వ్రాయాలి. మూడునెలల నోటీసు ఇచ్చి కవులును రద్దు చేసుకోవచ్చును. అయితే గడువుతో కలుపుకొని ఒకసంవత్సరం పూర్తికావాలి.

భూస్వామి ఈ క్రింది కారణముల మీద కవులును రద్దు చేయవచ్చును. (1) కవులు ఖత్తులో నిర్ణయించుకున్న తేదీ దాటినతరువాత నెలరోజుల్లోగా కట్టుబడి ఇవ్వనప్పుడు (2) భూమికి నష్టం కలిగేపని చేసినప్పుడు (3) వ్యవసాయమునకు గాక భూమిని ఇతర పనులకు ఉపయోగించినా (4) ఖత్తు షరతులను ఉల్లంఘించినా (5) భూమిని మళ్లీ ఇంకొకరికి కవులుకు ఇచ్చినా (6) కౌలుదారు దివాలా అయినట్లు కోర్టులు నిర్ణయించినా, భూస్వామి ఖత్తును అకాలముగానే రద్దు చేయవచ్చును. కట్టుబడి ఇవ్వలేదని భూస్వామి దరఖాస్తు చేసినప్పుడు అధికార్లు నిర్ణయించిన తేదీలోగా కట్టుబడి చెల్లించినచో కవులుదారుని తొలగించకుండా వుత్తర్వు చేయాలి. రెండు సంవత్సరములు కట్టుబడి బకాయిపెట్టిన రైతులకు ఈ రక్షణ వుండదు.

కవులు కాలములో స్వంత వ్యవసాయమునకు భూమిని యజమానికి విడుదల చేయవలసిన అవసరంలేదు.

కవులుదారు భూమికి చెరుపుచేసిన భూస్వామి సంబంధించిన అధికార్ల ద్వారా నష్టపరిహారం కోరవచ్చును.

వ్యవసాయములో దళారీలు వుండకూడదు. ధర్మసంస్థలు వగైరాలు భూములను నేరుగ రైతులకు కవులుకు ఇవ్వాలి.

స్వంత వ్యవసాయం రైతు లోకంలో ఎక్కువ తబ్దీల్లు రాకుండుటకు గాను స్వంత వ్యవసాయమునకు కూడా గరిష్ట ప్రమాణము నిర్ణయించాలి. అది రు 250 లు శిస్తు చెల్లించే భూమికిమించి వుండకూడదు. ఈ గరిష్ట ప్రమాణము నిర్ణీత తేదీన ఎక్కువ భూమిని సాగుచేసేవారికి వర్తించదు. అవిభాజ్య. కుటుంబాలకు ఈ విషయంలో మినహాయింపులు ఏమీ వుండవు. ట్రిబ్యునల్సు కొన్ని పరిస్థితులు షరతులలో గరిష్ట ప్రమాణమునకు మించి స్వంత సాగుకు అనుమతించవచ్చును. ఏ కొద్దిమందో కవులుకు తీసుకొనుటకు వీలులేకుండా కౌలుదారు రు 50 శిస్తుకు మించిన భూమిని కవులుకు తీసుకొనుటకు వీలు లేకుండా చేయాలి.

స్వంత వ్యవసాయ పరిమితికి మించిన భూమిని కౌలుకు తీసుకుంటే ఆ కౌలు చెల్లకపోగా జుల్మానాకు కవులుదారు బాధ్యుడవుతాడు.

వ్యవసాయోత్పత్తికి కనీస ధరలు నిర్ణయించాలి. వ్యవసాయాభివృద్ధి గ్రామస్థాయిలో క్రమబద్ధంగా జరగాలి.

కనీస మజూరీలు-కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల సంఘంవారు సూచించినట్లు వ్యవసాయ కూలీలకు కనీస మజూరీలు నిర్ణయించాలి. మజూరీలను మజూరీలబోర్డు నిర్ణయించవచ్చును. ప్రస్తుతము ధాన్యం రూపంలో ఇచ్చే మజూరీలను ప్రస్తుత ధరలను బట్టి నగదులోకి మార్చిన వెంటనే మజూరీలను నిర్ణయించుటకు వీలవుతుంది. పనివేళలు, సెలవులు మన దేశానికి కొత్త. ఇప్పుడు వానిని నిర్ణయం చేయవలసిన అవసరం లేదు.

ఆడవాళ్లకు, మగవాళ్లకు పనినిబట్టి మజూరీలు సమానంగావుండాలి. పిల్లల చేత పనిచేయించుటను పూర్తిగా నిషేధించ నవసరంలేదు. అవసరమైతే నిర్బంధ విద్యావిధానం అమల్లోవున్న చోట బడి సమయాల్లో పనిచేయించుటను నిషేధించవచ్చును.

వ్యవసాయ తరుణములలో రైతుల పిల్లలకు వీలుగా బడివేళలను విద్యాశాఖవారు నిర్ణయించాలి. రైతుకు కూలీకి అంగీకారమైన కనీస మజూరీలు నిర్ణయించాలి. ప్రస్తుత పరిస్థితులలో వ్యవసాయ కూలీలకు ఉద్యోగ నిర్ణయ కేంద్రాలవల్ల ప్రయోజనం లేదు.

వ్యవసాయ కూలీలకు ఇళ్లు దొరికించుటకు ప్రభుత్వము శ్రద్ధవహించాలి.

రాజ్యాంగసూత్రము 23 (1) ననుసరించి అన్నివిధముల వ్యవసాయ దాస్యమును వెట్టిని నిషేధించాలి.

రాజకీయ బాధితులకు, మాజీసైనికులకు భూములనిచ్చే తలంపును 1951 మార్చి 31 లోగా ముగించివేయాలి. అప్పటినుంచి భూమిలేనివారికి భూములిచ్చే వీలుండదు.

### వ్యవసాయకూలీ సంఘాలు

వ్యవసాయకూలీ సంఘాలు ఏర్పడుట అవసరం. వానిని ప్రోత్సహించాలి. అయితే సమ్మెలు, యజమానులు వ్యవసాయము మానేస్థితి వస్తే వ్యవసాయదార్లకు అవాంతరము కలుగకుండా చూడవలసిన బాధ్యత ప్రభుత్వము వారిదే.

### లాండ్ ట్రిబ్యునల్సు

రివిన్యూ డివిజనల్ ఆఫీసరు అధ్యక్షుడు గానూ, వ్యవసాయ కూలీలు భూస్వాములు, కౌలుదార్ల ప్రతినిధులు సభ్యులుగానూ, ప్రతి రివిన్యూడివిజన్‌కు "లేండ్ ట్రిబ్యునల్" ను ఏర్పాటుచేయాలి. ఈ ట్రిబ్యునల్ (1) కట్టుబడి రాబట్టుకొనుటకు వేసే దావాలుతప్ప సరసమైన కట్టుబడులు నిర్ణయించుట మొదలగు విషయాలను పరిష్కరించెదరు. (2) కనీసమజూరీల చట్టముక్రింద కనీసమజూరీలు నిర్ణయములో సలహా ఇచ్చును. (3) ప్రత్యేక సౌకర్యాలు, మినహాయింపులు ఇచ్చెదరు. (4) గరిష్టప్రమాణము వ్యవసాయదార్లు కానివారు భూములు కొనుటకు సంబంధించిన కేసులను పరిష్కరించును. ట్రిబ్యునల్ నిర్ణయములమీద కలెక్టరుకు, కలెక్టరునిర్ణయములమీద రెవిన్యూబోర్డుకు అప్పీలు వుంటుంది.

రైతులు, కూలీల ప్రయోజనాలు భిన్నమూ పరస్పర విరుద్ధమైనందున కౌలుదార్లు, కూలీలకు సంఘాలు విడివిడిగా వుండాలి. పట్టణ కార్మికులతో సంబంధంలేకుండా వ్యవసాయ కూలీలను సంఘటితం చేయాలి. వ్యవసాయ సంఘాల కార్యనిర్వాహకులు వ్యవసాయ కూలీలనుండే వుండాలి. ఈ సంఘాలు ఏ రాజకీయపక్షమునకు ముడిపెట్టుకోకూడదు. అయితే ఇదే స్వభావమైన యూనియన్లతో కలవవచ్చును. సమాఖ్యగా ఏర్పడవచ్చును. వ్యవసాయం అంతా గ్రామస్థుల అజమాయిషీ క్రింద జరగాలనే కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణలను అంగీకరించుటకు వీలులేదు.

"లాండ్ కమిషన్"ను నియమించాలనే సూచన కూడా మాకు ఇష్టం కాదు. అవసరమైతే వ్యవసాయమునకు సంబంధించి సలహా లిచ్చుటకు రాష్ట్ర, జిల్లాబోర్డులను నియమించవచ్చును. ఈ సలహా సంఘాలను "జిల్లా వ్యవసాయ కవున్సిల్" అనవచ్చును. ఈ కవున్సిల్‌లో జిల్లా కలెక్టరు, జిల్లాలోని శాసనసభ్యులు, జిల్లాబోర్డు అధ్యక్షుడు, జిల్లాలోని మరికొందరు ప్రముఖులు వుండాలి. కవున్సిల్‌కు కలెక్టరు అధ్యక్షుడుగా వుండాలి.

రూరల్ ఎకనమిక్ సర్వీసును ఏర్పాటు చేయనవసరంలేదు.

కౌలుకు సంబంధించిన షరతులు తప్ప తతిమ్మా శిఫార్సులు సర్వసామాన్యముగా మలబార్ కౌలుచట్టము అమలుజరిగే ప్రాంతాలకు కూడా వర్తించును.

### జమీందారీలు

జమీందారీ ప్రాంతాలు మూడు తరగతుల క్రిందికి వస్తాయి.

(1) జమీందారీల రద్దుక్రింద స్వాధీనపరచుకున్న ఎస్టేట్లు, లేక జమీందారీలు.

(2) జమీందారీల రద్దు చట్టము వర్తించి ఇంకా స్వాధీనం చేసుకోకుండా వున్న జమీందారీలు.

(3) జమీందారీల రద్దు వర్తించని ప్రాంతాలు.

మొదటి తరగతి ప్రాంతాలకు ఈ కమిటీ శిఫార్సులు అన్నీ వర్తించును. రైతువారీ పట్టాకు అర్హులయిన వ్యక్తులు భూస్వాములుగను తాత్కాలిక శిస్తు మదింపు ఈ స్కీములో ఉదహరించిన శిస్తుమదింపుగనూ, భూమికౌలుకు చేస్తూవున్న వారిని కౌలుదార్లుగనూ పరిగణిస్తారు.

రెండవ తరగతికికూడా మొదటి తరగతివలెనే శిఫార్సులు వర్తించునుగాని ఎస్టేట్లను స్వాధీనం చేసుకొనేవరకు వానిస్థితి మూడవ తరగతివానివలె వుండును.

మూడవ తరగతి విషయంలో భూస్వామి కౌలుదారు సంబంధాలకు సంబంధించిన శిఫార్సులు వర్తించవు. ఇతర శిఫార్సులు సర్వసామాన్యముగా వర్తించును. ఈ సందర్భమున జిరాయితీ రైతును రైతువారీ పట్టాదారుగను, చెల్లించే శిస్తును, శిస్తు మదింపుగా పరిగణించాలి.

మైనరు ఈనాంల విషయములో సర్వాధికారములుగల ఈనాంలు రైతువారీ భూముల స్థాయిలోనే వుండి యజమానే భూస్వామి అవుతాడు. అధికారములులేని మైనరు ఈనాంలకు సంబంధించినంతవరకు ఈనాందారునే భూస్వామిగ ఎంచవలెను. ఈ రెండు కేసులలో కూడా భూమిని తీసుకొని సాగుచేసే వారిని కౌలుదార్లుగ పరిగణించవలెను. పైన ఉదహరించిన సందర్భములలోనేగాక వీలున్న చోట్లల్లా ఈ శిఫార్సులను మైనరు ఈనాంలకు కూడా వర్తింపజేయవలెను.

## పాలస్తీనా పరిస్థితి: ఇజ్రేల్ వైఖరి

ఐక్యరాజ్యసమితి, జూన్ 30: పాలస్తీనాలో సైనిక రహితంగా చేయబడ్డ ప్రాంతంలోనుంచి తన పోలీసులను ఉపసంహరించటానికి ఇజ్రేల్ నిరాకరించినదని సమితి సైనిక వ్యవహార శాఖాధిపతి జనరల్ రైలీ నేడు సమితికి నివేదించారు. అక్కడ నుంచి పోలీసులందరినీ ఉపసంహరింప వలసినదని [illegible] కోరినది కాని, అక్కడవున్న కార్మికుల రక్షణకోసం పోలీసులు ఉండకతప్పదని ఇజ్రేల్ అధికారులు జవాబిచ్చారు.

# కమ్యూనిస్టు జవాబుకు సమితి నిరీక్షణ

(1 వ పేజీ తరువాయి)

జరిపినట్లు తెలుస్తున్నది.

## జనరల్ అసెంబ్లీ ప్రత్యేక సమావేశం

ఐక్యరాజ్యసమితి, జూన్ 30:- కొరియా మొదలైన ఆసియా ప్రాంతాల రాజకీయ సమస్యలను చర్చించటానికి ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ ప్రత్యేక సమావేశం జరపవచ్చునని తెలుస్తున్నది. ఈ సమస్యల మీద చర్చ తేలిగ్గా తేలదని, సమావేశం సెప్టెంబరుదాకానో యింకా నవంబరు దాకానోకూడా సాగవచ్చునని అనుకుంటున్నారు.

కొరియా యుద్ధ విరమణానంతరం జరగవలసిన ముఖ్యమైన పనులు ఇవి: 38 వ అక్షాంశ రేఖవెంట తటస్థ ప్రాంతం ఏర్పాటు చెయ్యటం, యుద్ధ విరమణ పర్యవేక్షణకు అంతర్జాతీయ కమీషన్‌ను నియమించటం, స్థానిక సైన్యాల నిరాయుధం చెయ్యటం, విదేశీయ సైన్యాలను క్రమంగా ఉపసంహరించటం, ప్రజాస్వామ్య సూత్రబద్ధంగా సమైక్య కొరియాను స్థాపించేందుకు దేశవ్యాప్తంగా ఎన్నికలు జరపటం,వీటన్నిటికీ అవసరమైన ఏర్పాట్లు చేయడమేగాక ఫార్మోజా భవిష్యత్తు సమితిలో కమ్యూనిస్టు చైనా ప్రాతినిధ్య సమస్య ఈ రెండు జటిల విషయాలనుకూడా జనరల్ అసెంబ్లీ చర్చించవలసి వుంటుంది. ఈ రెండు విషయాల్లో అమెరికా ప్రభుత్వం వైఖరి ఈ మధ్య మరింత తీవ్రమైందన్న సంగతి పాఠకులు ఎరిగిందే. పాలస్తీనావలె కొరియాలోకూడా జనరల్ అసెంబ్లీ ఆయా సమస్యలను పరిశీలించటానికి ఒక కమీషన్‌ను నియమించవచ్చునని అనుకుంటున్నారు.

## అధ్యక్షుడు రీ వైఖరి

పూసాన్, జూన్ 30: జనరల్ రిడ్జ్వే యుద్ధవిరమణ ప్రతిపాదన దక్షిణ కొరియా ప్రభుత్వాన్ని చాలా కలవర పెడుతోంది. 38 వ అక్షాంశరేఖ సరిహద్దుగా యుద్ధం విరమిస్తే కొరియాను కృత్రిమంగా విభజించినట్లవుతుందనీ ఈ ప్రతిపాదన కొరియా ప్రజలకు మహా అవమానకరంగా వుందనీ అంటూ అధ్యక్షుడు సింగ్మన్ రీ ఈ మధ్య ఒక ప్రకటన చేశాడు. ఇప్పుడు సింగ్మన్ రీ తన పూర్వ వైఖరిని కొంత మార్చుకొని ఏవో కొన్ని షరతులమీద యుద్ధ విరమణకు అంగీకరించవచ్చునని అనుకుంటున్నారు. ఆయా విషయాలను చర్చించడానికి సింగ్మన్ రీ ఈ వేళ ప్రొద్దున ప్రధాన మంత్రి జాన్‌చాంగ్‌తోను ఇతర ఉద్యోగులతోను సమావేశం అయినాడు.

కమ్యూనిస్టులు కనీసం ఈ క్రింద చెప్పిన 5 షరతులకు అంగీకరిస్తేనే గాని తన ప్రభుత్వం వారితో సంధి చేసుకోనేవీలేదంటూ దక్షిణ కొరియా విదేశాంగ మంత్రి ప్యాన్ యాంగ్‌టాయ్ ఈ వేళ పూసాన్‌లో మాట్లాడుతూ అన్నాడు. ఆయన పేర్కొన్న షరతులివి:

ఒకటి, ఉత్తరకొరియాలో ప్రజల ఆస్తులకు, ప్రాణాలకు యింకా అధిక నష్టం కల్గించకుండా చైనా కమ్యూనిస్టుసైన్యాలు మంచూరియాలోకి వెంటనే తరలిపోవాలి.

రెండు, ఉత్తరకొరియా కమ్యూనిస్టులను నిరాయుధులను చెయ్యాలి.

మూడు, ఉత్తరకొరియాకమ్యూనిస్టులకు ఆర్థికంగాగాని, సైనికంగాగాని, మరేవిధంగాగాని ఏ విదేశమూ సహాయం చెయ్యకుండా ఐక్యరాజ్యాలు చూడాలి.

నాలుగు, కొరియాకు సంబంధించిన ఏ విషయంగురించి ఎప్పుడు సంప్రతింపులు జరిగినా, ఆ సంప్రతింపులలో కొరియా రిపబ్లిక్ ప్రతినిధి ఒకడు పాల్గొనాలి.

అయిదు, కొరియా రిపబ్లిక్ సార్వభౌమత్వానికిగాని, సమైక్యతకుగాని భంగంకలిగించే ఏ ఒడంబడికను లేదా ఏ కార్యక్రమాన్ని మేము పాటించము. అలాంటి ఒడంబడికలూ పథకాలూ చట్టరీత్యా చెల్ల నేరవు.

జనరల్ రిడ్జ్వే సందేశం టోకియో, సెంజాయ్, ఒసాకా మిలిటరీ రేడియో స్టేషన్లద్వారాను యింకా ఇతర జపాను రేడియో స్టేషన్లద్వారాను, వాయిస్ ఆఫ్ అమెరికా స్టేషన్ ద్వారాను ఇంగ్లీషు చైనా కొరియా భాషల్లో ప్రసారం చేయబడింది.

## సమితి సైనిక అధికారుల విశ్వాసం

టోకియో, జూలై 1: జనరల్ రిడ్జ్వే సందేశానికి కమ్యూనిస్టులవద్ద నుంచి ఇంతవరకు ప్రత్యుత్తరం లేదు; కాని కమ్యూనిస్టులు ఇవాళకాకపోతే ఇంకా కొద్దిరోజులకైనా జవాబిచ్చి తీరుతారని ఐక్యరాజ్యసమితి సైనికాధికారులు ఇప్పటికీ దృఢంగావిశ్వసిస్తున్నారు.

జనరల్ రిడ్జ్వే సందేశాన్ని యీ వేళ మళ్ళీ వివిధ రేడియోస్టేషన్ల ద్వారా కమ్యూనిస్టులకు ప్రసారం చేయటం అయింది.

కమ్యూనిస్టులవద్దనుంచి త్వరలో ప్రత్యుత్తరం రాకపోతే, రిడ్జ్వే సందేశాన్ని అచ్చువేయించి ఆ కాగితాలను కమ్యూనిస్టు సైన్యాలున్న ప్రాంతాల్లో వెదజల్లటం అవుతుందని సైనికాధికారులు చెప్పారు.

కొరియాలో గడచిన 48 గంటల్లో ఎక్కడా చెప్పుకోదగినంత తీవ్రమైన సంఘర్షణలేమీ జరగలేదు. ఒకవైపు నుంచి కొరియా జలసంధిగుండా తీవ్రమైన తుపాను వస్తోంది; ఒకవేళ కమ్యూనిస్టులవద్దనుంచి వెంటనే సమాధానం వచ్చినా, ఈ తుపానులో జట్లాండియా నౌక పూసాన్ రేవునుంచి వాన్సాను ప్రయాణమై పోవటం సాధ్యం కాదని అనుకుంటున్నారు.

# 'మద్యపానం ఎల్లవారికీ మహానర్థమే'

శ్రీ రాజేంద్రప్రసాద్ ఉద్బోధ

హైదరాబాదు, జూలై 1: "మద్యాన్ని ఒక పానీయంగా వాడటం అన్ని దేశాలలోని అన్ని వర్గాల స్త్రీ పురుషులయొక్క ఆరోగ్యానికేకాక పనిపాటుల పాటవానికికూడా ప్రమాదకరమైన చెరుపు కలిగిస్తుంది. కాబట్టి, యీ అలవాటు ప్రోత్సాహం విచక్షణా జ్ఞానంగల ప్రతివానికీ విరుద్ధమైయున్నది" అంటూ ఇండియా అధ్యక్షుడు రాజేంద్రప్రసాదుగారు నేటి ఉదయం ఇక్కడ ప్రారంభమైన అంతర్జాతీయ యుక్తాహార విహారసంఘం (గుడ్ టెంప్లర్స్) తాలూకు శతాబ్దోత్సవాలకు పంపిన సందేశంలో ఉల్లేఖించారు. హైదరాబాదు ప్రధాన న్యాయమూర్తి ఆర్. యస్. నాయక్ గారు ఈ ఉత్సవాలకు ప్రారంభోత్సవం జరిపారు. హైదరాబాదు విద్యామంత్రి బి. రామకృష్ణరావుగారు ఈ ఉత్సవాలకు అధ్యక్షత వహించారు. "అదృష్టవశాత్తు మన భారతీయ సంప్రదాయాలు ఈ త్రాగుడు దురభ్యాసానికి ఆదినుంచి వ్యతిరేకతనే వెల్లడిస్తున్నవి. కాబట్టి, భారత దేశంలో ఈ దురభ్యాసాన్ని రూపుమాపడం సులభసాధ్యమే అవుతుంది. ఆ రూపుమాపడంవల్ల దేశానికి, దేశీయులకూ కూడా చాలా మేలు ఏర్పడుతుంది. ముఖ్యంగా బీదవారూ, పాటకజనమూ బాగుపడతారు" అని కూడా రాజేంద్రబాబుగారు తమ సందేశంలో తెలిపారు.

# ఢిల్లీలో వన మహోత్సవప్రారంభం

న్యూఢిల్లీ, జూలై 1: రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ నేడు ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ద్వితీయ వనమహోత్సవానికి ప్రారంభం చేశారు. ఆయన ఒక మామిడిమొక్కను నాటారు.

ఢిల్లీ విశ్వవిద్యాలయం అధ్యాపకులు, విద్యార్థులు, అతిథులు, ఇంకా ఎంతోమంది ఉద్యోగులు ఈ ఉత్సవానికి హాజరైనారు.

రాష్ట్రపతి అనంతరం విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు శ్రీ డా॥ డి. ఎస్. సేన్, శ్రీ మున్షీ, శ్రీ సంతానం, వైస్ అడ్మిరల్ సర్ ఎడ్వర్డుపారీ, ప్రభృతులు, విద్యాలయంలో మామిడి మొక్కలు నాటారు. ఈ విధంగా మొత్తం 95 మొక్కలు నాటబడినాయి.

ఈ ఉత్సవాన్ని ప్రారంభిస్తూ, రాష్ట్రపతి రాజేంద్రబాబు విశ్వవిద్యాలయం స్నాతకమందిరంలో ఉపన్యసించారు. శ్రీ మున్షీ మాట్లాడుతూ నిరుడు ఈ ఉత్సవం రాజఘాట్‌లో ప్రారంభమైంది. ఈ యేడు ఇచ్చట ప్రారంభమౌతున్నది అని అన్నారు.

# కొరియా యుద్ధం

## సమితిసేనల విమానదాడులు

టోకియో, జూలై 1: కొరియా యుద్ధరంగంలో సమితిసేనల తాలూకు జెట్టు విమానాలు కమ్యూనిస్టుల సప్లయి స్థావరముల మీదను యాంబోన్జోంవద్ద వున్న వారి కార్యాలయముల మీదను బాంబులు వేసినవి. 38 అక్షాంశరేఖకు యాంబోంజను సుమారు 20 మైళ్ల దూరంలో ఉత్తరంగా ఉంది.

సుమారు 100 మైళ్ల నిడివిగల యుద్ధరంగంలో అక్కడక్కడా చేరియున్న కమ్యూనిస్టుసేనలను కొండలవద్ద సమితి సేనలు గస్తీచర్యలు జరుపుచున్నవి. ఈ గస్తీ చర్యలలోనే పోరాటములు అక్కడక్కడా జరుగుచున్నవి.

కొన్సాంగునకు పడమరగాను వాయవ్యంగాను నిన్నటిదినం అంతా తీవ్ర పోరాటం జరిగింది. కమ్యూనిస్టుల పక్షమున 11,85,464 మంది నష్టమైనారని అమెరికను సైనికాధికార్లు అంచనా వేసిరి.

# తాయిలాండ్ ప్రధాని విడుదల

(1-వ పేజీ తరువాయి)

రామరూరుడు ధానినివాట్‌గారు ప్రెసిడెంటుగా ఉన్నారు. ఆయన ఇప్పుడు తిరుగుబాటుదార్ల పక్షమున ఆధిపత్యం వహించారు.

సయాం ఉప ప్రధాని స్వస్తికతి గారును వ్యదేశాంగ మంత్రి లైనవోమ్ తెగారున్నూ రోమునగరం నుంచి విమానంమీద బాంకాకు నగరానికి బయలుదేరి వస్తున్నారు.

## పోరాటం సమాప్తి

లండన్, జూలై 1: ఫిలిప్పయిను దీవుల ముఖ్యపట్టణమైన మనీలా నగరంలో నేటుదయం బాంకాకులోని సయాం ప్రభుత్వపు రేడియో ద్వారా యీ క్రిందివార్త వినవచ్చినది.

సయాం నావికాదళము సయాము ప్రభుత్వమును కూలద్రోయుటకు జరిగిన తిరుగుబాటు యిప్పుడు సమాప్తమైనట్లే — ఆ తిరుగుబాటుదార్లచే బందీగా పట్టుకొని పోబడిన సయాం ప్రధానియగు ఫీల్డుమార్షలు పిబుల్ సంగ్రాముగారికి ఏ విధమైన హానియూ చేయకుండానే తిరుగుబాటుదార్లు విడుదలచేసిరి.

# కొలంబోపథకం

(1 వ పేజీ తరువాయి)

కల్గించాలి. (3) ఆహారధాన్యోత్పత్తిని 6 మిలియన్ల టన్నుల మేరకు పెంచాలి. (4) విద్యుచ్ఛక్తిని 1100 వేల కిలోవాట్ల మేరకు పెంచాలి.

ఇవికాక ఈ పథకంలో మరికొన్ని ముఖ్య విషయాలుకూడా వున్నాయి. ఈ పథకం ప్రకారం దక్షిణ ఆగ్నేయ ఆసియా రాజ్యాలకు సాంకేతిక సహాయం చేయడం ఇతర దేశాలకు ఈ దేశాలవారిని పంపి సాంకేతిక నైపుణ్యాన్ని గరపడం మొదలైనవి కూడా వున్నాయి. మిల్లులు, ఫ్యాక్టరీలు, రోడ్లు రైలుమార్గాలు, మొదలైన వాటి అభివృద్ధిని గూర్చిన అంశాలుకూడా ఈ పథకాలలో వున్నాయి.

ఈ పథకాన్ని నేడు అమలులో పెట్టిన దేశాలు ఇవి: ఆస్ట్రేలియా, కెనడా, సిలోను, ఇండియా, పాకిస్తాన్, న్యూజిలాండు, వియట్‌నాం, లావ్స్, కంబోడియా, ఇండోచైనా, మలయా, సింగపూర్, ఉత్తర బోర్నియో, సారవాక్, బ్రిటన్, అమెరికా ఇంతవరకు కామన్‌వెల్తు సలహా సంఘం అన్న పేరుతో జరుగుతూవున్న సంఘం, అంతర్జాతీయ సలహాసంఘంగా మారుతుంది. ఇందులో ప్రతిఒక్క దేశానికి ఒక ప్రతినిధి యున్నాడు, అంతర్జాతీయ బ్యాంకు ప్రతినిధి యున్నాడు సభ్యులుగా వున్నారు. అమెరికాకూడా సలహాదారుని హోదాలో సభ్యత్వం పొందివుంది.

## ఇండియా పథకాలు

ఈ పథకంలో ఇండియాలో అమలుజరిగే పథకాలు కూడా కొన్ని వున్నాయి. వీటి నిమిత్తం ఇండియా 1840 కోట్ల రూపాయల ఖర్చు అంచనావేసింది. ఇందులో 1000 కోట్లు దేశంలో పోగుచేస్తుంది. తక్కినదాన్ని ఇతరదేశాలనుంచి అప్పుగా గ్రహించాలని చూస్తున్నది. ఈ పథకాలన్నిటిని భారతప్రభుత్వం ప్లానింగు కమిషన్ ద్వారా తయారు చేయిస్తున్నది. కమిషన్ తన పనిని పూర్తిచేసివేస్తున్నది.

## కెనడా ఆస్ట్రేలియాల వాగ్దానాలు

కొలంబో పథకం అమలుజరిగే తొలి సంవత్సరంలో ఆస్ట్రేలియా ఒక 5 కోట్ల రూపాయలు, కెనడా ఒక [illegible] కోట్ల రూపాయలు సహాయం చేయగలమని ఇండియాకు వాగ్దానాలు చేసాయి. కెనడా యంత్రాలు అప్పు సరఫరా చేస్తుంది. ఆస్ట్రేలియా ఆహార ధాన్యాలు ఇస్తుంది. ధాన్యాలమీద వచ్చిన డబ్బును భారతప్రభుత్వం ప్రాజెక్టులు మొదలైనవాటి నిర్మాణం నిమిత్తంగా ఉపయోగిస్తుంది.

## బ్రిటిష్ ఖజానా మంత్రి సందేశం

కొలంబో పథకం అమలులోకి వస్తున్న ఈ రోజున బ్రిటిష్ ఖజానా మంత్రి సలహా సంఘసభ్యులందరికీ సందేశాలు పంపారు.

ఈ పథకంలో ముడిపెట్టుకొన్న ఆగ్నేయ ఆసియా, దక్షిణ ఆసియా దేశాలన్నిటికి యంత్రసామగ్రి విరివిగా సరఫరా కాగలందులకు బ్రిటన్ తాను చేయగల్గినంతా చేస్తుందని ఆయన ఈ సందేశంలో ఉద్ఘాటిస్తూ, ఈ పథకం జయప్రదంగా కొనసాగ గలదని తాను విశ్వసిస్తున్నానని గెయిట్‌స్కెల్ ఈ సందేశంలో అన్నారు.

## బ్రిటిష్ ఖజానామంత్రికి భారత ఆర్థికమంత్రిసమాధానం

బ్రిటిష్ ఖజానామంత్రి గెయిట్‌స్కెల్ పంపిన సందేశానికి భారత ఆర్థికమంత్రి శ్రీ దేశ్‌ముఖ్ ఈ క్రింది సమాధానాన్ని ఇచ్చారు. "మీరు ఈ సందేశం పంపినందుకు ధన్యవాదాలు. ఈ పథకం విషయంలో మీ భావాలు ఎట్లావున్నాయో, నా భావాలు అట్లాగే వున్నాయి. ఇది జయప్రదం కావాలని మీకు మల్లే నేనూ ఆకాంక్షిస్తున్నాను. ఆసియాదేశాలకు యంత్రసామగ్రి సరఫరాను గూర్చి మీరు హామీ ఇచ్చివున్నారు. ముదావహంగావుంది. ఇట్టి స్నేహపూర్వకమైన సహకారంవల్ల ఈ పథకం జయప్రదంకాక తప్పదు."

## అచిసన్‌కు మారిసన్ సందేశం

ఈ అవసరాన్ని పురస్కరించుకొనే, బ్రిటిష్ విదేశాంగ మంత్రి హెర్బర్ట్ మారిసన్ అమెరికా విదేశాంగమంత్రి డీన్ అచిసన్‌కు ఒక సందేశాన్ని పంపారు. ఆగ్నేయ ఆసియాలో జీవిత ప్రమాణాలను, ఉత్పత్తి ప్రమాణాలను పెంచడంకోసం జరుగుతున్న ఈ మహాప్రయత్నంలో, అమెరికా సహాయాన్ని, సహకారాన్ని ఎంతోఇదిగా బ్రిటిష్‌ప్రభుత్వం కోరుతున్నది. అని ఆయన ఈ సందేశంలో అన్నారు.

# భారతదేశంలో అపహృత ముస్లింస్త్రీల ఉద్ధరణ

సిమ్లా, జూను 30: మేనెల చివర వరకూ భారతప్రభుత్వం కల్లోల సమయంలో అపహరించబడిన 14,728 ముస్లింస్త్రీలనూ పిల్లలనూ ఉద్ధరించినది. అదే సమయంలో పాకిస్థాన్ ప్రభుత్వం 7628 హిందూ, సిక్కు స్త్రీలనూ పిల్లలనూ ఉద్ధరించినది.

తూర్పు బెంగాల్ కాందిశీకుల సహాయం 1951-52 సం॥నికి భారతప్రభుత్వం 72 లక్షలు మంజూరుచేసింది. [illegible] బెంగాల్ కాందిశీకుల కోసం మొత్తం 116 లక్షలు ఈ ఏడాది మంజూరుచేయబడినది.

# సంపాదకునకు లేఖలు

## బొగ్గుగనుల కార్మికుల హీనస్థితి

ఆర్యా, సింగరేణి కాలరీస్ కంపెనీ యాజమాన్యాన నిర్వహించబడుతున్న కొత్తగూడెం, బెల్లంపల్లి, యల్లెందు బొగ్గుగనులలో పనిచేసే కార్మికుల కష్టాలు నానాటికీ హెచ్చుతున్నాయి. బొగ్గు వుత్పత్తి రోజురోజుకు తగ్గిపోతున్నది. బొగ్గుగనులలో యంత్రాలను విరివిగా ప్రవేశపెట్టాలనే వుద్దేశంలో యాజమానులు 'లేబర్ పూలు' పద్ధతి నొకదానిని ఆరంభించారు. ఆయా శాఖలలో అధికంగా వున్నట్లుతోచిన కార్మికులనందరినీ తొలగించి ఈ 'లేబర్ పూలు'కు పంపుతారు. 15 రోజులలోగా మరెద్దినా పనికి ఆ కార్మికుడు వుపయోగించకపోతే పూర్తిగా తొలగిస్తున్నారు. ఒక వంకను గోరఖ్‌పూరునుంచి 700 మంది కార్మికులను రావించి, వారికి పనులీయగలిగిన యజమానులకు వున్నవారు అనవసరంగా వున్నట్లుతోచటం వింతగా వుంది. మధ్యప్రదేశ్ సరిహద్దుకు అనుకొనివున్న సాస్తి బొగ్గుగని వర్షాకాలములో చుట్టుజలమయమై ఇతర ప్రపంచంవారు సంబంధం తెగిపోయి వుంటుంది. ఈ గ్రామంలో పోస్టాఫీసు లేదు. బట్టలకొట్టు, హోటలేదు; చిల్లర దుకాణంకూడా లేదు. కార్మికులందరూ చిరిగిన గుడ్డలతోనే వుంటారు. వారికి ముట్టే కూలీ రూపాయికి లోపు. పరాధీనంగా అక్కడ వున్న ప్రభుత్వ కార్మిక రక్షక కేంద్రంలో వున్న రేడియో ద్వారా తెలుగువారైన ఈ కార్మికుల ఒక్కనాడైనా తెలుగుప్రోగ్రామువినలేదట. బొగ్గుగనుల కార్మికుల తమ హీనస్థితిని గుర్తించి సమ్మె జేయ నిశ్చయించుకొన్నారు. ప్రభుత్వం జోక్యంకల్పించుకొని, వారి అభివృద్ధికి తగు మార్గములు ఏర్పడచేయగలందులకు ప్రార్థిస్తున్నాము:

సింగరేణి, పి. చలపతిరావు

## స్కూలు అసిస్టెంట్ల స్వంత జీతాలు

ఆర్యా, స్కూలు అసిస్టెంట్లకు స్కూళ్ల సీనియర్ డిప్యూటీ ఇన్స్పెక్టర్లకు నెలకు రు 15/-చొప్పున స్వంత జీతాలు ('పర్సనల్ పే') ప్రభుత్వం వారు మంజూరు చేసినట్లు దినపత్రికల వల్ల తెలుస్తున్నది. స్థానిక సంస్థల యాజమాన్యంలో నున్న స్కూళ్లలో పని చేసేవారికికూడా ఇట్టి వుత్తరువు ఎందుకు వర్తింపచేయలేదో తెలియరాకున్నది. ఈ వుపాధ్యాయులలో చాలా హెచ్చుమందికి ప్రభుత్వము వారు నిర్ణయించిన స్కేళ్లలో నైనా జీతాలు ముట్టటంలేదు. ప్రభుత్వము వారి సాధారణ పద్దుక్రింద ఆదాయంలోనుంచి కొంత భాగాన్ని వినియోగించి, తగుటలోవున్న స్థానిక సంస్థలకు చేయూత యిచ్చిఅయినా, వారిచేత ప్రభుత్వ స్కేళ్లలో జీతాలు యిప్పించాలనీ, స్వంత జీతాల జీ. ఓ. ను స్థానిక సంస్థలలో పని చేసే వుపాధ్యాయులకుకూడా వర్తింపచేయమని వేడుకొంటున్నాను.

అమలాపురం. బి. వై. సోమయాజులు.

## ఆసవ, అరిష్టాలు

ఆర్యా, ఆసవాలు, అరిష్టాలనేవి ఆయుర్వేద వైద్య విధానంలో అతి ప్రాచీన ప్రాచీనమైనవి. ఏనాటినుంచో వుపయోగంలో వున్నవి. ఇవి సారా కల్లు, ఈత కల్లు వీటిమాదిరిగా నిషా ఎక్కించేవి కావు; ప్రతినిత్యమూ వాడబోయేవి కావు. అటువంటి ఈ ఆసవారిష్టాలలో మద్రాసు ప్రభుత్వం వారికి ఏ దోషం కనుపించిందో అర్థం కాదు. రిజిష్టరైన ఆయుర్వేద వైద్యులకందరకూ ఆసవారిష్టాలు తయారుచేసుకునేందుకు ప్రభుత్వం యిప్పటికైనా అనుమతి యీయాలని వేడుకొంటున్నాను. బీహారు, యు. పి. రాష్ట్రప్రభుత్వాల మాదిరిగా మన మద్రాసు ప్రభుత్వంకూడా ఆయుర్వేద వైద్యాన్ని ప్రోత్సహించ గలదని ఆశిస్తున్నాము. పోటుమెరక. విష్ణుభొట్ల నాగేశ్వరశర్మ.

## లేఖాంశాలు:

రాష్ట్రశాసన సభకు నియోజక వర్గాలను నిర్ణయించటంలో గన్నవరం తాలూకాకు అన్యాయం జరిగిందని తుర్లపాటి వెంకట సుబ్బారావుగారు (గన్నవరం) అంటున్నారు. ఈ తాలూకాలోని వీరవల్లి ఫిర్కా నూజివీడు తాలూకాలోనూ, గన్నవరం, పుయ్యూరు ఫిర్కాలు గుడివాడ తాలూకాలోనూ ఈ తాలూకాలోని కపిలేశ్వరపురం ఫిర్కాలోని కంకిపాడు, ఉయ్యూరుఫిర్కాలతో కలపటం జరిగిందంటున్నారు. గన్నవరం తాలూకా మూడు నియోజకవర్గాలలో ముక్కలు ముక్కలుగా వేయబడినందువల్ల ప్రాతినిధ్య విషయంలో లోటు ఏర్పడుతుందనీ, యీ సవరణ చేయించ భారత ప్రభుత్వమువారూ, శాసనసభలలో ఆంధ్ర సభ్యులూ పూనుకోవాలని విన్నవిస్తున్నారు.

ఆకివీడునుండి మూర్తి గారు ఒక జాబు వ్రాస్తూ సమానమైన శిక్షణపొంది వున్న మెడికల్ డిపార్టుమెంటు కాంపౌండర్లు, వెటరినరీ కాంపౌండర్లకు జీతాలలో వ్యత్యాసాలు తొలగించాలని అంటున్నారు. మెడికల్ కాంపౌండర్లకు 1-9-50 నుంచి రు. 45-2-55-1-75 స్కేలు నిర్ణయించారని, వెటరినరీ కాంపౌండర్లకు రు. 35-1-60 స్కేలు మాత్రం [illegible], యీ వ్యత్యాసాన్ని తొలగించమనీ ప్రభుత్వాన్ని కోరుతున్నారు. (Nilgiris)

# రాష్ట్ర వార్తలు

## నెల్లూరు

స్థానిక కొ‌న్‌కో-ఆపరేటివ్ స్టోర్సు సామాన్యసభ యీ 21 వ తేదీ శ్రీనివాసులునాయుడుగారి అధ్యక్షతను జరిగింది. 1951-52 సం॥ బడ్జెట్‌ను ఆమోదించినమీదట వేమూరు వెంకటప్పయ్య, యేలేశ్వరపు ఆదిశేషారెడ్డి, అబుల్ రహిమాన్ కోకా సాహెబు గార్లను డైరెక్టర్లుగా ఎన్నుకొన్నారు. తమ స్టోర్సు ప్రతినిధిగా జిల్లా సహకార కేంద్ర బ్యాంకు సభ్యునిగా కోటా ఆదిశేషుగారిని, జిల్లా కో ఆపరేటివ్ స్టోర్సు సభ్యునిగా సుంకు సంగయ్య రాయసెట్టి గారిని ఎన్నుకొన్నారు.

## గుడివాడ

వాసివల్లి చేబ్రోలు వెంకటసుబ్బయ్యగారి అధ్యక్షతను ఈ 17వ జరిగిన బహిరంగసభలో తిరంగా నాయకులు ర్యాలి పిచ్చిరామయ్య శాస్త్రిగారికి సన్మానం చేయాలని తీర్మానించుకొన్నారు. చే. వెంకటసుబ్బయ్యగారు అధ్యక్షులుగాను, కాశీనాధుని కామేశ్వరరావుగారు కార్యదర్శిగాను గల ఒక ఆహ్వాన సంఘాన్ని ఎన్నుకొన్నారు.

## రాజమహేంద్రవరం

ఈ 20 వ పురమందిరంలో పట్టముట్ట సోమరాజుగారి అధ్యక్షతను శాంతి సమావేశం జరిగింది. శాంతి ఉద్యమం యొక్క ఆవశ్యకతను గురించి పాలకోడేటి సూర్యప్రకాశరావు, కె. నాగభూషణరావు, మిద్దింటి నరసింహమూర్తి, జామి సన్యాసిరావు, విలూరు సూర్యారావుగార్లు ప్రసంగించారు. పట్టముట్ట సోమరాజుగారు రక్షకులుగను, పాలకోడేటి సూర్యప్రకాశరావు కె. నాగభూషణరావుగార్లు ఉపాధ్యక్షులుగను, వి. వి. రమణయ్య, జామి సన్యాసిరావుగార్లు కార్యదర్శులుగను, యం. శ్రీరామమూర్తిగారు కోశాధికారిగాను ఒకకమిటీఎన్నుకొన్నారు.

## మండపేట

ఈ 24 వ యిక్కడ బళ్ల రామన్నగారి అధ్యక్షతను జరిగిన బహిరంగ సభలో చేనేతసత్యాగ్రహం, ప్రభుత్వ వైఖరులను గూర్చి కనకం అప్పలస్వామిగారు వుపన్యసించారు. పెద్దాపురం భద్రందరంవారు నేతాజీ జీవితం బుఱ్ఱకథ చెప్పారు.

## ఎండ్లూరు

పార్లమెంటు సభ్యుడు వి. వి. కేశవరావుగారు ఈ 28 వ యిక్కడ వ్యవసాయకూలీల సభలో ప్రసంగిస్తూ యీ కూలీలకనీస వేతనాల నిర్ణయానికి ప్రభుత్వంవారు చేస్తున్న కృషిని వివరించారు. వీరందరినీ ప్రభుత్వంతో సహకరించవలసిందిగా కోరారు. చేనేత సత్యాగ్రహం వివిధ రాజకీయ కారణాలవల్ల జరుగుతున్నదని చెప్పి, ఆ కారణంచేత అందరూ ఆ వుద్యమాన్ని నిరసించాలన్నారు. హరిజనులందరూ విద్యావంతులు కావాలని పాపయ్యగారు అన్నారు. శౌరిగారి వందనాలతో సభ ముగిసింది.

## విజయవాడ

సచ్చిదానందేంద్ర సరస్వతీస్వామి పరిషత్తు ఆధ్వర్యాన కోదండ రాముల యింట ఇటీవల బోధానందేంద్ర సరస్వతీస్వామివారి అధ్యక్షతను జరిగిన సభలో కుప్పా లక్ష్మీనారాయణ శాస్త్రిగారు తెనాలిలో యీ 23 వ పరమపదించినందుకు సానుభూతి తీర్మానం చేశారు. సూరిపెద్ది కృష్ణమూర్తి, కోట శ్రీరామమూర్తి ద్రోణంరాజు రామచంద్రరావుగార్లు శాస్త్రిగారి జీవిత విశేషాలను గూర్చి వుపన్యసించారు.

కృష్ణామండల మహిళా సంఘ కార్యవర్గం వారు ఇక్కడ కలగర బిచ్చమ్మగారియింట యీ 16 వ సమావేశమైనారు. మార్ల దేవర అన్నపూర్ణమ్మ, మూపరనేని మనోరమ, యలమంచిలి దమయంతి, మూరపనేని వరలక్ష్మి, ఈడ్పుగంటి రత్నమాంబ, లక్ష్మీ వరసమ్మగార్లు తదితరులు యిందు పాల్గొన్నారు. మహిళలందరు సంఘాలలో చేరవలసిందిగా కోరుతూ ఒక తీర్మానం చేశారు.

## చీరాల

ఈ 19 వ తేదీరాత్రి విజయనగరం వాస్తవ్యులు కొల్లయ్యగారి కుమార్లు చి॥ విశ్వనాధరావు (10 సం॥) చిరంజీవిరావు (7 సం॥) చి॥ శ్రీనాధరావు (5 సం॥) గాంధి జీవితచరిత్రను బుర్రకథగా చెప్పారు.

స్థానిక హైస్కూలు పూర్వ విద్యార్థి సంఘసభ ఇటీవల ఘంటా కృష్ణారావుగారి అధ్యక్షతను జరిగింది. ఆదిపూడి సుబ్బారావుగారు సభను ప్రారంభించారు. భావ విప్లవాన్ని గూర్చి కొల్లా సుబ్బారావుగారు ఉపన్యసించారు. చీరాల బాలకృష్ణమూర్తి, వి. వరదరాజు గార్ల గాన కచ్చేరిలు, జి. వెంకటేశ్వర్లుగారి హరికథా కాలక్షేపం జరిగాయి. ఊటుకూరి కోటయ్య శ్రేష్ఠిగారు అధ్యక్షులుగాను, పూటుకూరి సీతారామయ్య, రావుల రాఘవరావుగార్లు కోశాధికారులుగాను, గుంటూరు రామమూర్తి, పెంచేల రామచంద్రరావు, కొల్ల నరసింహారావు, ఎం. సత్యనారాయణ రామయ్య, ఎం. శివసాంబమూర్తి, కె. ఎల్. కృష్ణమూర్తిగార్లు కార్యవర్గ సభ్యులుగాను ఎన్నికైనారు. ఇప్పటి స్థాపించబోతున్న పూటుకూరి రామయ్యశ్రేష్ఠి కళాశాలకు సికిందరాబాదు, కాలేజి కమిటీ [illegible] గ్రామనిర్మాణం [illegible] (…లు చేశారు.

## గుడివాడ

ఈ తాలూకా ప్రజాపార్టీ కార్యవర్గ ఎన్నిక కోసంకటి రాజ బాపయ్యగారి అధ్యక్షతను యీ 25వ యిక్కడ జరిగింది. తాలూకా సంఘ అధ్యక్షులుగా సూరపనేని వెంకటేశ్వరరావు, కార్యదర్శిగా మంగళగిరి నాశరథ, సహాయ కార్యదర్శిగా చ. సీతారామయ్యగార్లు, మరి 12మంది కార్యవర్గ సభ్యులుగాను ఎన్నికైనారు.

## చాగల్లు

తాడ్లూరి సూర్యనారాయణగారి అధ్యక్షతను యిక్కడ యీ 22 వ బహిరంగసభ జరిగింది. తిల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు ప్రస్తుత దేశ పరిస్థితులను వివరించారు. స్వామి సీతారాంగారి ఆదేశానుసారము సభవారు ఆంధ్రరాష్ట్ర స్థాపనను గూర్చిన తీర్మానం చేశారు. కోసివటి అప్పారావుగారి వందనాలతో సభ ముగిసింది.

## కృష్ణంపాలెం

వసల శివరామశర్మగారి అధ్యక్షతను యీ 26 వ సమావేశమైన యీ గ్రామ ప్రజలు స్వామి సీతారాంగారి సూచన మేరకు ఆంధ్రరాష్ట్ర స్థాపన అక్టోబరు 2 లోగా జరుగాలని తీర్మానించారు.

## కౌతరము

గుడివాడ తాలూకాకు చెందిన యీ గ్రామములో కృష్ణాజిల్లాబోర్డు సభ్యులు పామిరెడ్డి వెంకటసుబ్బారెడ్డిగారిచే, బోర్డు హైస్కూలుకు ప్రారంభోత్సవము జరుపబడినది. ఈ పాఠశాలలో మొత్తము 250 విద్యార్థులు గలరు. నాల్గవ ఫారములో సుమారు 70 మంది విద్యార్థులు గలరు. సదరు హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ చింతలపాటి వెంకట కృష్ణారావుగారు గత సంవత్సర నివేదికను తెలియజేసిన అనంతరము ఉపన్యాసకులు విద్యాసంస్థల ఆవశ్యకతను గూర్చి ఉపన్యసించారు.

## కన్నెలూరు

ఈ 26 వ తేదీ ఉదయం యీ గ్రామములో "ఓటర్ల సంఘ" మొకటి ప్రారంభించ బడింది.

సంఘ కార్యవర్గమునకు జె. వడిపి సుబ్బయ్య, అరలేటి మద్దన్న, యం. బాలయ్య, కె. వెంకటసుబ్బయ్య, గుర్రం చెన్నయ్య యం. సంబెన్న సందు చిన్న సుబ్బన్న, కొటం వీరన్న, మన్నా చిన్న మల్లయ్య పి. వెంకటప్ప పుట్టె శంకరయ్య సున్నా చినగురప్ప సాదు వెంకటస్వామి గారలు నియమింపబడిరి.

ప్రతిగ్రామానికి ఓటర్ల పట్టి, కొనుటకును ప్రచారము చేయుటకు ప్రచారముకొరకు వేయి రూ.ల నిధి వసూలు చేయుటకు తీర్మానించుకొన్నారు.

## సైదాపురం

నెల్లూరుజిల్లాలోని అభ్రకపు గనుల కార్మికులు యిక్కడ ఇటీవల పి. శ్రీధరరావుగారి అధ్యక్షతను సమావేశమై 'ఆంధ్రరాష్ట్ర మైకా మజ్దూర్ పంచాయత్' అను పేరుతో ఒక కార్మిక సంఘాన్ని స్థాపించుకొన్నారు. ఈ సంఘానికి అధ్యక్షుడుగా ఎం. మాధవరావు, ఉపాధ్యక్షుడుగా జక్కల ఆదిశేషయ్య, కార్యదర్శిగా వంజవాక వెంకటసుబ్బయ్య, సహాయ కార్యదర్శులుగా ఎన్. సిద్దయ్య, పేదగిరి సుబ్బరామయ్యగార్లు, కార్యవర్గ సభ్యులుగా మరి 4 గురు ఎన్నికైనారు. కొమ్మనేటూరు ఆ చుట్టు ప్రక్కల 7 గ్రామాలలో రేషన్ షాపులు లేనందువల్ల అక్కడ 4 వేల మంది ప్రజలు బాధపడుతున్నారనీ, వారికోసం అక్కడ వెంటనే రేషన్ షాపులు స్థాపించవలసినదనీ ప్రభుత్వాన్ని కోరారు.

## సందూరు

ఇచ్చట ఆంధ్రకేసరి గ్రంథాలయ వార్షికోత్సవం యీ 17 వ మల్లాది యజ్ఞనారాయణగారి అధ్యక్షతను జరిగింది. కార్యదర్శి అన్నంరాజు సత్యనారాయణగారు నివేదిక సమర్పించారు. గ్రంథాలయానికై చేయదగిన కృషిని గూర్చి జమ్మలమడక మాధవరామశర్మగారు వుపన్యసించారు. మల్లాది చిరంజీవి శాస్త్రిగారి వందనాలతో సభ ముగిసింది.

## వేటపాలెం

గుంటూరుజిల్లా దేవాంగ విద్యార్థి సాంస్కృతి సంఘ ప్రథమ వార్షికోత్సవ మహాసభలు యీ 16, 17 తేదీలలో జరిగినవి. మదరాసు కార్పొరేషన్ స్పెషల్ ఇంజనీరు పి. రామస్వామి చెట్టియార్, మద్రాసు త్యాగరాయ కాలేజి ప్రిన్సిపాల్ యం. శ్రీరాములు యం. చొక్కలింగం చెట్టి కె. వీరభద్రస్వామి, బందరు హరిజన వెల్ఫేర్ ఆఫీసరు యం. కరియప్ప. విజయవాడ రైల్వే పోలీసు సర్కిల్ యిన్స్పెక్టరు పి. మల్లిఖార్జునరావుగారలు యీ సభలో పాల్గొన్నారు.

## తెనాలి

ఈ తాలూకా ప్రజాపార్టీ ప్రథమ సమావేశం జూలై 20 వ తేదీ మధ్యాహ్నం ఇచటి రాయల్ టాకీసులో వెలుగువారి వెంకటవరశింహ్వం పంతులుగారి అధ్యక్షతను జరిగింది. వెలుగువారి వెంకటవరశింహ్వం పంతులుగారు శ్రీ యిక్కుర్తి వారి కృష్ణప్రసాద్, మునిపల్లె జగన్నశాస్త్రి, అజ్జరం సుబ్బారావు, అయ్యగారి వీరేశ్వరరావు, కేవి రామారావుగార్లు కాంగ్రెసు ప్రస్తుత విధానాన్ని విమర్శిస్తూ మాట్లాడారు.

తాలూకా కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీకి [illegible] నాయకుడు [illegible] వెంకట్రామయ్యగారిని కార్యదర్శిగాను ఎన్నుకోవడమైనది.

# బియ్యంమిల్లు లైసెన్సు ఉత్తర్వు

## హూ. కృష్ణాహల్లర్ మిల్లులవారి అసమ్మతి

(స్వకీయ విలేఖరి)

బందరు, జూన్ 28: ఈ ఏప్రిల్ 19 వ తేదీనుండి అమలులోకి వచ్చిన బియ్యం మిల్లుల క్రొత్త లైసెన్సింగు ఉత్తర్వును పురస్కరించుకొని కృష్ణాజిల్లా సప్లయి ఆఫీసరుగారు జిల్లాలోని హల్లర్ మిల్లులకు యిటీవల ఒక తాఖీదు పంపారు.

హల్లర్ మిల్లులవారు క్రొత్త లైసెన్సులకుగాను 24/-రు. ల ఫీజు క్రిందను, 200/-రు. సెక్యూరిటీ క్రిందను ప్రభుత్వ ఖజానాలో జమకట్టి, ఆరసీదులతోపాటు, లైసెన్సింగు ఉత్తర్వులో తమ తాఖీదులోనూ పేర్కొనబడిన ఫారం I ను పూర్తిచేసి జూన్ 30వ తేదీలోగా బెజవాడలోని డి.యస్.ఒ. ఆఫీసులో దాఖలు చేయాలని; రెవిన్యూ బోర్డువారి ఉత్తర్వు ప్రకారం హల్లరు మిల్లులలో కొన్ని మార్పులు చేస్తూ సెపరేటర్‌ను కూడా యేర్పాటు చేయాలని; యీ మార్పులు జూన్ 30వ తేదీలోగా జరుగనియెడల లైసెన్సులు యివ్వబడవని, జిల్లా సప్లయి ఆఫీసరుగారు తమ తాఖీదులో స్పష్టపరిచారు.

తూర్పుకృష్ణా హల్లరుమిల్లులసంఘంవారు, 26 వ తేదీనచి. సత్యనారాయణగారి అధ్యక్షతన యిచట సమావేశమై, జిల్లా సప్లయి ఆఫీసరుగారి తాఖీదుపట్ల తీవ్ర అసమ్మతి ప్రకటించారు.

జిల్లా సప్లయి ఆఫీసరుగారు తమ తాఖీదుతోపాటు జతపర్చవలసిన చెప్పిన క్రొత్తఫారం హల్లర్ మిల్లులవారికి అందనేలేదని, పి. మహాలక్ష్మయ్యగారన్నారు. ఈ తాఖీదు ప్రకారం హల్లరు మిల్లుల మార్పులను చేయడం యెలా సాధ్యం కాదో మహాలక్ష్మయ్యగారిలా వివరించారు.

"హల్లర్ మిల్లులు సామాన్యంగా 5 మొదలు 10 హార్సు పవరు ఇంజన్లతో నడుపబడుచున్నవి. క్రొత్తలైసెన్సింగు ఉత్తర్వు ప్రకారం సెపరేటర్‌ను యేర్పాటు చేసినట్లయితే, ప్రస్తుతమున్న ఇంజను లాగలేవు. అందువల్ల పవరును హెచ్చుచేయాల్సి ఉన్నది. అదిగాక చాల మిల్లులకు యిప్పుడున్న భవనాలు చాలవు. ఈ మార్పులు చేయాలంటే జిల్లా కలెక్టరుగారి అనుమతి పొందవలసి ఉన్నది. సెపరేటర్‌ను అమర్చియెడల తవుడుకు కనీసం 8 బస్తాలకు తగ్గకుండా ధాన్యం ఆడించవలసి ఉండుటచే ప్రస్తుతం మరకం మొదలు పావు బస్తా వరకు ధాన్యం మరపట్టించుకొని వచ్చే వారికి యిక ఆ సదుపాయం ఉండదు. కనుక సెపరేటర్ పద్ధతి ప్రజలకు లాభంగా ఉండదు. లైసెన్సింగు ఉత్తర్వులో, హల్లరు మిల్లరులు యెంతిధాన్యం కొన్నదీ యేవిధంగా విడుదల చేసినదీ ఎంతధాన్యము, బియ్యము, మిగిలినది నెల నెలా లెక్కలను డి. యస్. ఓ. గారికి పంపవలెనని ఉన్నది హల్లరుమిల్లులకు ధాన్యసేకరణ లైసెన్సులు లేవు వారు ధాన్యంకొని మరపట్టుటకు వీలులేనప్పుడు యిలా నెలసరి లెక్కలను పంపమనడం అన్యాయం."

తిరువాత ఎ. గోపాలకృష్ణ రావుగారు మాట్లాడుతూ హల్లరు మిల్లులలో సెపరేటర్‌ను యేర్పాటుచేస్తే, చిట్టు తవుడు రాకపోగా, బియ్యం తినడానికి పనికిరావని, అయినా డి.యస్.ఓ. తాఖీదులో పేర్కొన్నట్లు మిల్లుల్లో మార్పులను చేయుటకు వ్యవధిచాలదని అన్నారు. ఈ హల్లరు మిల్లులకే పిండి మరలుగూడా యేర్పాటు చేయబడినవి డి. యస్. ఒ. గారు సూచించిన మార్పులు అమలుజరిపితే పిండిమరలు ఆగిపోవలసి వస్తుందని గోపాలకృష్ణ రావుగారు చెప్పారు.

పై ఉపన్యాసాలలోని వివిధ అంశాలపై తీర్మానాలు ఆమోదింపబడినవి మిల్లు లైసెన్సింగ్ క్రొత్త ఉత్తర్వులో కోరబడిన మెషినరీ మార్పులు హల్లరుమిల్లులకు వర్తింపకుండా చేయుటకున్నూ, యీ మార్పులు చేయని హల్లరు మిల్లులపై అధికారులు యెట్టి చర్య తీసుకొనకుండునట్లున్నూ ప్రభుత్వంపై తాత్కాలిక ఇంజంక్షన్ జారీ చేయించవలసిందిగా మద్రాసు హైకోర్టులో రిట్ దరఖాస్తు దాఖలు చేయుటకు తీర్మానించారు.

## తెనాలితాలూకాలో రంగాగారి పర్యటన

తెనాలి, జూలై 29: ఆంధ్రప్రజాపార్టీ ఉపనాయకుడు రంగాగారు, శ్రీయుతులు మాకెను వరసింహారావు, రావి సత్యనారాయణ ప్రభృతులతో కలిసి నిన్నటినుంచీ ఈ తాలూకాలో పర్యటన ప్రారంభించారు. దోనెపూడి గ్రామస్థులు వూరేగింపులో రంగాగారికి స్వాగతమిచ్చి గ్రామంతరపున రూ 1000 లు యిచ్చారు. అచటజరిగిన బహిరంగసభలో రంగాగారు వుపన్యసిస్తూ తాను కాంగ్రెస్ నుండి ఎందుకు వైదొలగినదీ చెప్పారు. కూలీలకు ప్రభుత్వం వరివేయ కూలిరేటును నిర్ణయించాలని, రైతులు కూలీలపట్ల సామరస్యంగా మెలగాలనిఅన్నారు. అట నుండి సపరివారంగా కొల్లూరుపల్లి బహిరంగ సభలో పాల్గొన్నారు. కొసరనేని అంకినీడుగారు 116/-లు రాటికపాటి వెంకటరావుగారు 116/-లు [illegible] 78/-లు రంగాగారికి యిచ్చారు. రంగాగారు రాత్రికి తెనాలివచ్చి బెజవాడకు వెళ్ళారు. (స్వ. వి.)

# మదరాసు ఆంధ్ర కాంగ్రెసు సంఘం

## 4వతే. ఎన్నికలునిర్ణయించుటకు సభ

మదరాసు, జూలై 1: జిల్లా కాంగ్రెసు సంఘం పంచాయితీ సభ్యుల అత్యవసర సమావేశం జూలై 4 వ తే. సా. 5-30 గం. తిరువళిక్కేణి హైరోడ్డు 751 భవనమున జరుగునని డా॥ కె. వి. స్వామిగారు ప్రకటిస్తున్నారు. రాష్ట్ర కాంగ్రెసు కమిటీవారి తాఖీదులను విచారించి జిల్లా కాంగ్రెసు కమిటీ ఎన్నికలను నిర్ణయించుటకు యీసభ జరుగుచున్నది. గనుక సభ్యులందరు విచ్చేయ కోరుతున్నారు.

మదరాసు యువజన కాంగ్రెసు నుండి ఏలూరులో జరుగు ఆంధ్రరాష్ట్ర యువజన సభకు 25 ప్రతినిధులను ఎన్నుకొనుటకు, జిల్లా సంఘసభ 3 వ తే. సా. 5-30 గం. 751 తిరువళిక్కేణి హైరోడునందు జరుగునని అధ్యక్షులు డా॥ కె. వి. స్వామిగారు ప్రకటిస్తున్నారు.

## రాష్ట్ర పరిశ్రమలమంత్రికి చేనేత జాతీయకాంగ్రెసు విన్నపం

మదరాసు, జూన్ 29: ఆంధ్రరాష్ట్ర జాతీయ చేనేత కాంగ్రెసు తరఫున శ్రీ సుడిమెళ్ల గంగరాజు, జి. కోటయ్య, పుత్సల చిన్నయ్య, గోలి సుదర్శనం, ములకల గంగాధరరావు, చేబ్రోలు సుబ్బారావుగార్లు నేడు పరిశ్రమల శాఖమంత్రి పెరుమాళ్‌స్వామి రెడ్డిగారిని సందర్శించి, ఒక విన్నపం దాఖలుచేశారు.

నూలుకొరత సమస్య పరిష్కరించడానికి గౌ॥ మంత్రి మెహతాబ్‌గారు యిచ్చిన హామీని వెంటనే అమలు జరపాలని, రాష్ట్రంలో నూలు నికరమయిన మగ్గాలకు మాత్రం పంచాలని, జిల్లా నూలు సలహా సంఘాలను యేర్పాటుచేయాలని, రాష్ట్ర చేనేత కమిటీలో ఖాళీస్థానాలకు జాతీయ చేనేతకాంగ్రెసు ప్రతినిధులను నియమించాలని కోరారు. మంత్రిగారు సావధానంగా విని తగు చర్య గైకొందుమని చెప్పినట్లు తెలుస్తున్నది.

## వినోదాలపన్ను మినహాయింపు

భవన నిర్మాణాలకు తిరితర ఉదార కార్యములకై జరిపించు నాటకాలూ పాటకచేరీలు మున్నగు వినోద ప్రదర్శనములను పన్ను నుండి మినహాయించుటకు పెట్టేదరఖాస్తులు కమర్షలు టాక్సు ఆఫీసరులద్వారా అటజరుగుటకు 2 నెలలు ముందుగా ప్రభుత్వానికి పంపాలని, అపుడే ఉద్యోగులు తగువిచారణలుచేసి, రెవెన్యూబోర్డువారి ద్వారా ప్రభుత్వానికిపంపి మంజూరు చేయించగలరనియు, మదరాసు ప్రభుత్వప్రకటన తెల్పుచున్నది.

## చీఫ్ ఇంజనీరు

ఇరిగేషను ఛీఫ్ఇంజనీరు ఎ. ఆర్. వెంకటాచారిగారు నేడు విమానంపై ఢిల్లీమీదుగా సిమ్లాకు వెడలిరి. సెంట్రలు ఇరిగేషనుబోర్డు పరిశోధన సంఘ సమావేశంలో పాల్గొంటారు.

## పాతాళభైరవి శతదినోత్సవం

గుడివాడ, జూన్ 28: పాతాళభైరవి శతదినోత్సవ సందర్భంలో డైరెక్టరు శ్రీ కె. వి. రెడ్డి, కవి పింగళి నాగేంద్రరావు, నటులుయన్.టి.రామారావు రంగారావు, రేలంగి, వెంకట్రామయ్య మాలతి, బాలకృష్ణ, పద్మనాభం గార్లు, నిన్న ఇక్కడకువచ్చారు. వీరికి శ్రీనివాస సినీమా హాలులో సన్మానం జరిగింది. సభకు స్థానిక కాలేజీ ప్రిన్సిపాలు ఎ. యస్. త్యాగరాజుగారు అధ్యక్షత వహించారు.

"ఉత్తమమైన సంగీతం, చిత్రకళలు, మానవుని ఎటువంటి ఉన్నతమైన స్థాయికి తీసుకునిపోగలవో, అదేవిధంగా ఉత్తమమైన చలనచిత్రాలు కూడా ఉన్నతస్థితికి తీసుకొని పోగలవు. పాతాళభైరవిచిత్రము వివిధరుచులను ప్రేక్షకులకొరకు అందజేసింది. అందుకు ఈ శతదినోత్సవములే తార్కాణం" అని త్యాగరాజుగారన్నారు.

అతిథులకు కాజ వెంకట్రామయ్యగారున్నూ, ఆంధ్రనాటకకళాపరిషత్తు (గుడివాడశాఖ) తరఫున కార్యదర్శి జే. స్వామినాథశాస్త్రి గారున్నూ సన్మానపత్రములను సమర్పించారు.

దర్శకుడు, కవి, నటీనటులు సన్మానమునకు కృతజ్ఞత తెలిపారు.

తిరువాత నటకులకు దర్శకునికి, కవికి డిస్ట్రిబ్యూటర్లు కాజ వెంకట్రామయ్యగారు విలువగల రజత పాత్రలు బహూకరించారు. శ్రీనివాస సినిమా హాలు సిబ్బందికి ఈసందర్భంలో కాజ వెంకట్రామయ్యగారు 1 నెల జీతం డిస్ట్రిబ్యూటర్లు 1 నెలజీతం బోనస్సుగా ఇచ్చారు. (స్వ. వి)

## కాకినాడ

కాకినాడ, జూలై 29: పాతాళభైరవి శతదినోత్సవ సందర్భములో డైరెక్టరు కె. వి. రెడ్డి, నటులు ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, రేలంగి, బాలకృష్ణ పద్మనాభం గార్లకు శ్రీ సతి మాలతికి కాకినాడ క్రాస్‌టాకీస్ తరఫున ప్రొప్రయిటరు శ్రీ జి. రాఘవులుగారు వెండిపాత్రలు యిచ్చి బహూకరించారు. 26 వ తేదీన క్రౌన్‌టాకీసులో జరిగిన యీ సన్మాన సభకు మునిసిపలు చైర్మన్ వంటి సీతాపతి రావుగారు అధ్యక్షత వహించారు. సన్మానానికి కె. వి. రెడ్డి, ఎన్. టి. రామారావుగార్లు తగు రీతిని సమాధానమిచ్చారు. (స్వ. వి.)

# అడవుల అభివృద్ధి

## నగరంలో వనమహోత్సవ కార్యక్రమం ప్రారంభం

### వ్యవసాయశాఖామంత్రి విజ్ఞప్తి

మదరాసు, జూలై 1: నగరంలో వనమహోత్సవం పీపిల్సు పార్కులో నేడు ప్రారంభిస్తూ వ్యవసాయశాఖ మంత్రి గౌ॥ ఎ. బి. షెట్టిగారు రాష్ట్ర భూమివిస్తీర్ణంలో నాటికి 17 వంతులే అడవులున్నవనీ, అలాగాక అన్ని జిల్లాలలో అయిదోవంతో, నాల్గోవంతో అడవులుండిన రయితులకూ, దేశానికి లాభకరంగా ఉండునని చెప్పిరి. ఆ విధంగా అడవుల విస్తీర్ణాన్ని పెంచుటకు తగినన్ని చెట్లు నాటి వాటిని పెంచుటకు ప్రజలంతా తోడ్పడాలని, విన్నవించిరి. కార్పొరేషను కమిషనరు శ్రీ సి. నరసింహంగారు స్వాగతోపన్యాసంలో కార్పొరేషను గత ఏడాది చేసిన కృషిని వివరించి, నగరంలో మేకలను పెంచకుండా ప్రభుత్వం నిషేధించాలని సూచించేరు. మేయరు రామనాధం చెట్టిగారు సత్యాభివృద్ధి కార్యక్రమం వలన అడవులకు కొంతనష్టం కలిగిందనియు, అడవులు పెంచుటకు తగు కృషి చేయాలని హెచ్చరించారు.

సభ పార్కులో చక్కగ అలంకరించిన పందిరిలో జరిగింది. కమిషనరుగారు యీ ప్రాంతాలవారలు సెప్టంబరులో ప్రారంభమయినా, ఇండియా ప్రభుత్వంవారి సూచన ప్రకారం యీ ఉత్సవం యిపుడే ప్రారంభించితిమనిరి. నిరుడు కార్పొరేషను నాటిన 75,000 చెట్లలో 50,000 బ్రతికియున్నా యనియు, రాష్ట్ర మొత్తంపై నాటిన 82 లక్షలలో 327400 సజీవంగా నున్నా యనియు, యిది మెచ్చదగినదనియు చెప్పారు. నిరుడు మొక్కలు ఊరికే యిచ్చినా గృహస్థులు 500 మాత్రం పుచ్చుకున్నారు. సంస్థలు 3000 పుచ్చుకొని నాటేవనియు, అందుచే యీ యేడు అణాకొక మొక్క చొప్పున విక్రయించి నచో కొని నాటినవారికి పెంచే శ్రద్ధయుండునని ప్రభుత్వంవారు సూచించినందున, విక్రయించుచున్నామనిరి. ప్రతి యింటిముందు రోడ్డుప్రక్కన రెండు చెట్లను గృహస్థులు నాటాలని కోరిరి. మేకలు ఈ మొక్కలను తినేస్తున్నా యని, వాటిని బంజరుదొడ్డిలోనికి తోలుట కష్టసాధ్యమనియు, పందులను నాశనంచేయుట కఠినకారంయున్నట్లే, మేకలను కంట్రోలు చేయుటకు గూడ కార్పొరేషనుకు అధికారం యివ్వాలని, లేదా మేకల పెంపకం పూర్తిగ నిషేధించాలని, కమిషనరు సి. నరసింహంగారు సూచించారు.

మేజరు మంత్రిగారికి స్వాగతమిస్తు యుద్ధకాలంలో కలపకొరకు అడవులు నాశనం చేయబడ్డాయనిరి. తిరిగిఅడవులను వృద్ధిచేయాలి. మనపూర్వీకులు చెట్లునాటి వాటిని పూజించేవారు కనుక సకాలవర్షములుండేవి. మనంఅట్లు చేయాలి. చెట్లు అడవులు దేశంయొక్క ఆస్తిగ చూచుకొని వాటిని పెంచుటకు ప్రజలంతా తోడ్పడాలనిరి.

మంత్రిగారు కార్పొరేషను నిరుడు చేసినపనికి అభినందించి, యీ యేడు యింకను ఎక్కువచేసి, యితరస్థానిక సంస్థలకు ఆదర్శంగా నుండగలదని ఆశిస్తున్నా మన్నారు. అనివిసంపన దేశసంపద వ్యవసాయమునకు యెంతయు అవసరము. ఈ విషయంగురించి చెట్లునాటు ప్రచారం అంతర్జాతీయ సమస్యగా నేడు ప్రచారమగుచున్నది. నిరుడు యీ రాష్ట్రంలో 40 లక్షలు నాటాలని ప్రారంభించి 82 లక్షలు నాటబడెను. అందు ద. కనరా జిల్లా అన్ని జిల్లాలను మించినదని తెల్పుటకు గర్వించుచున్నాను. ఈ ఏడు 50 లక్షలు నాటదలచితిమి. అందు 1/8 భాగం ఫల వృక్షాలు. రోడ్డు ప్రక్కన చెట్లను పరిశీలవారిని పట్టియిచ్చినవారికి ప్రభుత్వంవారు బహుమతులు యివ్వదలచిరని చెప్పేరు.

డిప్టీ మేయరు కన్నప్పరుగారు వందనము లర్పించుటలో సభ ముగిసెను.

తిరువాత మంత్రిగారు, సివిలు సప్లయిసు కమిషనరు ఎం. వి. సుబ్రహ్మణ్యం, మేయరు, ఆహార శాఖ కార్యదర్శి ఆర్. ఎం. సుందరం, జిల్లా కలక్టరు రామచంద్రను, కమిషనరుగార్లు ఒకొక్క చెట్టు నాటేరు.

## ముఖ్యమంత్రి విన్నపం

ముఖ్యమంత్రి గౌ॥ కుమారస్వామి రాజాగారు వనమహోత్సవం సందర్భంలో ఇలా ఒక విజ్ఞప్తిచేశారు.

వనమహోత్సవం శిశమంతటా నేడు ప్రారంభమయింది. ప్రారంభం నేడు జరిగిన వర్షాలననుసరించి ఆయా ప్రాంతాలలో అక్టోబరు వరకు యీ కార్యక్రమంకొనసాగవచ్చును. చెట్లు నాటుట దేశసంపదకంతె అవసరమో చెదుగ చెప్ప నక్కర లేదు. వంటచెరకుకు చాలక రయితులు పెంట ఎరువులకు పనికి వచ్చేసామగ్రి పొయ్యిలకు వుపయోగిస్తున్నారు. చెట్లులేక వానలుతగ్గుచున్నవి. ఎరువులులేక పంటలు నేడు చున్నవి. అందుచే చెట్లునాటుటను ప్రోత్సహించడానికి వనమహోత్సవం తలపెట్టబడింది. వ్యవసాయ అభివృద్ధి శాఖలవారు యీ విషయమున ప్రజలకు కావలసినసహాయం చేస్తారు. చెట్లునాటే ఉద్యోగ గాగ. నాటవలెను నాటి పెంచుటయందు మిగుల శ్రద్ధవహించాలి. ఒక వృక్షాన్ని పెంచి చావకుండాకాపాడినచో రెండుచెట్లు నాటి నట్లే. దేశాభిమానంగల ప్రతివారు ఈ జాతీయోద్యమము నందు పాల్గొని, నిరీక్షిన్న యీ జాతీయోద్యమము కృషిచేయాలని కోరుచున్నాను.

## ఆహారమంత్రి శ్రీ మున్షీ విజ్ఞప్తి

న్యూఢిల్లీ జూన్ 29: దేశభవిత వ్యాన్ని కాపాడే నిమిత్తం వనమహోత్సవాలకు కడంగ వలసిందిగా భారత ఆహారమంత్రి శ్రీ మున్షీ నేడు భారత ప్రజలకు ఒక విజ్ఞప్తి చేశారు.

ద్వితీయ వనమహోత్సవం రేపు ప్రారంభమౌతుంది. నేడు రేడియో ద్వారా మాట్లాడుతూ మున్షీ ఈలా అన్నారు: ఈ వనమహోత్సవాలను ఏదో గమ్మత్తుకోసం ప్రారంభించలేదు. దేశం యొక్క భావి భాగ్యాన్ని ఆశించి దీనిని ప్రారంభించాము. రాజపుటానా ఎడారి ఏడాదికి అరమైలు చొప్పున పెరుగుతున్నది. దీన్ని అరికట్టడానికి అడవులను నాటడం కన్నా వేరు మార్గంలేదు. అదీ కాక భూసారం నిలిచి వుండాలన్నా, కొండ చరియలు సారవంతంగా వుండాలన్నా, ఈ చెట్లనాట్లు అవసరంగా జరిగి తీరాలి. ఇంకో విషయమేమిటంటే అడవులు తక్కువ అవడంచేత వంటకట్టెయలు లేక ఎరువు క్రింద పనికివచ్చే ఆవు పేడను పిడకలుగా చేసి తగుల వేస్తున్నారు. చెట్ల పెంపకంవల్ల ఈదోషం గూడా పరిహారం అవుతుంది. అడవులు ఎక్కువగా లేకపోవడం వల్ల నదులు ఇంకిపోతున్నాయి. ఇదిగూడా ఒక చెరుపే. ఈ చెరుపులన్నీ మానిపోవడానికి అడవులను పెంచాలి. ఇందువల్ల ఆహారధాన్యాల ఉత్పత్తి ఏమితగ్గదు. 100 లక్షల టన్నులు పెరుగుతుంది.

వన మహోత్సవం ఇప్పుడు ఉత్పత్తి విధానంలో ఒక భాగంగా స్వీకరించబడింది. ఈ సంవత్సరం మనం 3 కోట్ల చెట్లను నాటాలి. ఇందులో ఒక కోటి పళ్ళ చెట్లు, ఈ ఉత్సవాలలో విద్యార్థులు ఎక్కువగా పాల్గొనాలి. ప్రతి విద్యార్థి ఒక మొక్కను నాటాలి. ఇవ్వాళ్టితే ఈమొక్క రేపటి చెట్టు ఇవ్వాళ్టితే విద్యార్థి రేపటి పౌరుడు. ఈ వనమహోత్సవం రేపు ప్రారంభమై అగస్టు 15 దాకా జరుగుతుంది.

## కో-ఆపరేటివ్ సూపర్‌వైజరు పరీక్ష

పై పరీక్షలో ఉత్తీర్ణు లయినవారి నెంబర్లు:

1 వ తరగతి

రాజమండ్రి: 4089 90 4111 20 48

2 వ తరగతి

రాజమండ్రి: 4077 78 80 టు 83 85 టు 88 91 టు 98 4100 టు 03 05 07 టు 10 12 13 19 21 టు 24 26 టు 29 32 టు 37 40 41 44 46 టు 48 50 53 టు 56.

అనంతపురం: 4157 58 62 టు65 67 75 76 79 80 82 84 టు 89 93 96 99 4200 02 టు 07.

1, 2, 3 పార్టు థియరీ మాత్రం

రాజమండ్రి: 4079 4118 25 52.

అనంతపురం: 4183.

1, 2, 4 పార్టులు మాత్రం

రాజమండ్రి: 4138.

1, 2, 4 భాగాలు

అనంతపురం: 4174.

1, 2 భాగాలు

రాజమండ్రి: 4254.

1, 3 భాగాలు

మదరాసు: 4272.

1, 4 భాగాలు

రాజమండ్రి: 4104 30 49.

అనంతపురం: 4168 72 95.

2, 4 భాగాలు

రాజమండ్రి: 4139 45.

అనంతపురం: 4181 92 4201.

3, 4 భాగాలు

అనంతపురం: 4198.

1 భాగం

రాజమండ్రి: 4084 4255.

అనంతపురం: 4161 66 70 4269.

2 భాగం

రాజమండ్రి: 4257 58 60 61.

అనంతపురం: 4268.

మదరాసు: 4273.

3 వ భాగం

రాజమండ్రి: 4256 55 66.

అనంతపురం: 4270 71.

మదరాసు: 4274,

4 వ భాగం

రాజమండ్రి: 4097 4115 16 17 42 51.

అనంతపురం: 4159 71 73 78 90 94, 97.

## ఆయిలు ఇంజనుల దిగుమతి

వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుటకుగాను డియిసలు అయిలు ఇంజనుల దిగుమతిని ఇండియా ప్రభుత్వంవారు 1951 సం॥న ఎక్కువచేశారు. 0-10 హార్సుపవరుగల ఇంజనులు 1951 డిశంబరు ఆఖరులోగా స్టీమరెక్కించే మాటుంటే, దిగుమతిదారులుఎన్నైనా తెప్పించుకోవచ్చును. తరువాత మరన్నిటు సదుపాయాలు యివ్వజాలని దిగుమతిదారులకు జూనులోగా లైసెన్సులు రెట్టింపుచేయబడును. 11-20 హా. ప. గల ఇంజనులు లైసెన్సు విలువకు 3 రెట్ల వరకు జూనులోగా తెప్పించవచ్చును. ఈ నియమముల మార్పు నాటి వ్యవసాయంగల రయితులకు ఎక్కువ లాభించునని, తక్కువ పవరుగల ఇంజనులు ఎక్కువగా దిగుమతియు, నీటిపాను సదుపాయాలు అందరా వ్యవసాయదారులకు లభించగలవని ప్రభుత్వంవారు ఆశిస్తున్నారు.

# బ్రిటన్ ఫిర్యాదుపై హేగ్ కోర్టు విచారణ

(1 వ పేజీ తరువాయి)

ప్రభుత్వంతో కాదు. అందువల్ల ఈ వివాదంతో బ్రిటిష్ ప్రభుత్వానికి సంబంధం లేదు.

(2) 1932 లో పర్షియా అంతర్జాతీయ న్యాయస్థానపు అధికారాన్ని అంగీకరించినప్పుడు తన అంతరంగిక వ్యవహారాలమీద దాని అధికారాన్ని ఆమోదించటం లేదని స్పష్టంచేసినది. న్యాయస్థాన నియమావళిలో 36 వ సూత్రాన్నిపట్టి, ఒప్పందానికి చెందిన పక్షాలు ప్రతిపాదించిన అంశాల మీదనే విచారణాధికారం ఉన్నది. అందువల్ల వివాదాన్ని విచారించే అధికారం అంతర్జాతీయ న్యాయస్థానానికి లేదు.

(3) ఐక్యరాజ్యసమితి నియమావళిలోని 2 వ సూత్రాన్నిపట్టి ఒక దేశానికి సంబంధించిన అంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకునే అధికారం సమితికిలేదు.

## నూనెకంపెనీ భవనంపై పోలీసు దాడి

టెహరాన్, జూన్ 30: పర్షియా పోలీసులు నేడిక్కడ ఆంగ్లో ఇరానియన్ కంపెనీ భవనంమీద దాడి చేశారు. రహస్యపత్రాలకోసం, రహస్యరేడియో యంత్రంకోసం వెతకటానికి తాముపచ్చినట్లు వారు సోదావారంటును చూపించారు.

ఆ తరవాత పోలీసులు కంపెనీ షైర్ స్టేషనును గంటకుపైగా అయిదాలకోసం గాలించారు.

టెహరాన్‌లో నూనె కంపెనీ భవనం కంపెనీ గూఢచారులకూ, ప్రచారానికీ, రహస్యరేడియో ప్రసారాలకూ కేంద్రంగా ఉన్నదని పర్షియా పత్రికలు ఇటీవల విరివిగా వ్రాస్తున్నవి.

ప్రస్తుతం ఏర్పడిన అవాంతర పరిస్థితిమూలంగా, విదేశాల్లో ఉన్న పర్షియన్ ప్రతినిధులకూ, విదేశాంగశాఖోద్యోగులకూ ఇవ్వబడిన సెలవులు రద్దు చేయబడినవి.

## అమెరికాలో పెట్రోలు రేషనింగు?

వాషింగ్టన్, జూలై 30: పర్షియా నూనెగనుల మూసివేతవల్ల ప్రపంచమంతటికీ అమెరికా పెట్రోలును సప్లయి చేయవలసివస్తే, అమెరికాలో రేషనింగు పెట్టటం అవసరమవుతుందని నిన్న రాత్రి అమెరికన్ ప్రజాప్రతినిధి సభలో డెమాక్రాట్ సభ్యుడు హారిస్ హెచ్చరించారు.

నూనె సమస్యపట్ల బ్రిటన్ వైఖరిని విమర్శిస్తూ అయన ఈవిధంగా అన్నారు.

"అబదాన్ కర్మాగారం మూసివేయకతప్పదని బ్రిటన్ భావించటం పొరబాటు. ఆ కర్మాగారం మూసివేయటం జరగరాదని అమెరికా స్పష్టం చేయవలెను. అబదాన్ కర్మాగారం మూయబడితే దానివారకు సరిపోయే ఉత్పత్తిని చేయగల కర్మాగారం ప్రస్తుతం ప్రపంచంలో ఎక్కడాలేదు."

## పర్షియాకు అమెరికా సాంకేతికసహాయం చేయాలి

పర్షియా ప్రభుత్వం కోరేట్లయితే పర్షియాకు అమెరికన్‌నూనె నిపుణులను సప్లయి చేయాలని అయన ఒక బిల్లును ప్రతిపాదించారు.

"బ్రిటిష్ నిపుణులు నిష్క్రమించటంవల్ల అబదాన్ కర్మాగారం మూయబడితే, అమెరికన్ నిపుణులు కూడా తోడ్పడరని అమెరికన్ విదేశాంగశాఖ పర్షియాను బెదిరించినదన్న వార్త చాల ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఇంతకన్నా తెలివితక్కువ మరొకటి ఉండదు. ఇతరత్రా నిపుణులు పర్షియాకు లభించరు. కనుక పర్షియన్లు రష్యన్ నిపుణుల సహాయాన్ని కోరే పరిస్థితులను తెచ్చిపెట్టినవార మవుతాము. దానికి సరిగా విరుద్ధవైఖరి నే మనం అవలంబించవలసి ఉన్నది.

అబదాన్ కర్మాగారం మూయబడితే, మన సప్లయిలోనుంచి నూనెను సప్లయి చేసేదిలేదని మనం స్పష్టం చేయవలెను. అప్పుడు బ్రిటన్ తన వైఖరిని మార్చుకుని కర్మాగారం పని సాగిపోయేట్లు చేయగలదు." అని ఆయన ఉద్ఘాటించారు.

పుదుచ్చేటలో కువంనదిలో 30 తే. సా. ఒకతండ్రి, కూతురు, 9 సం॥ కొడుకు పడిపోయి, కొట్టుకొనుచుండగా దారినిపోయేవారు తండ్రిని కూతురుని తీసి రక్షించిరి. బాలుడుగుపడలేదు. ఫైరుసర్వీసు ఉద్యోగి ఒకడు ఆ బాలుని పయికి తీసెను. కాని ప్రథమ చికిత్సచేసి ఆస్పత్రికి తీసుకొనిపోయేలోగా చనిపోయెను.

## తిరిగి వేలం అమ్మకము

ఇందుమూలముగా తెలియ వరచునదేమనగా 28-5-51 తేదీన జరిగిన వేలములో డిపాజిటు అయిన రాజమండ్రిలోని గాదిరెడ్డి నరసింహారావుగారి రిస్కుమీదను, ఖర్చుమీదను, సి. ఎస్. 170 48 & 101/0 నెంబర్లలో, జాయింటు రిసీవర్లు రోషన్. ఎల్.ఎం.ఏ. ఎక్కింటిల్ అండ్ కంపెనీ ఇన్సాల్వెన్సు క్రింప, తూర్పుగోదావరిజిల్లా, రాజమండ్రి, నం. 36 నంబరుగలిగిన రాజమండ్రిలోని సుమారు 4 ఎకరముల 80 సెంట్లభూమి, అందులోని టానరీ బిల్డింగులు, పరికరములు. సామానులతో సహా, సదరు స్థలమున్న మద్రాసు, 375 నేతాజీ సుభాష్ రోడులోని గవర్నమెంటు వేలముదారులు గాలి అండ్ కంపెనీవారిచే 8-7-51 ఆదివారము ఉ. 9-30 గం. లకు తిరిగి వేలం వేయబడును.

## సదరన్ రైల్వే గ్రెయిను షాపులకు సరుకులను సప్లయి చేయుటకు టెండర్లు,

## సవరణ

ఈ పత్రికలో 26-6-51 తేది గల టెండరునోటీసు ప్రకటింపబడినసంగతి గ్రహముతో, సదరన్ రైల్వే, తిరుచునాపల్లి, జోన్ II కు దిగువ తెలిపిన సరుకులు కావలసి యున్నవని టెండరుదారులకు తెలియపరచడమయినది.

(1) కందిపప్పు
(2) మినపపప్పు
(3) శనగపప్పు
(4) పెసరపప్పు
(5) నువ్వులనూనె
(6) కొబ్బరినూనె
(7) ఉప్పు

26—6—1951 తేదీ గల టెండరు నోటీసులో తెలిపిన యితర షరతులు యధాప్రకారముగానే యుండును.

చేర్మన్,
జాయింట్ పర్చేజింగ్ బోర్డు,
(సదరన్ రైల్వే, & బి. ఎన్. రైల్వే)
సూపరింటెండెంటు ఆఫీసు. రైల్వే గ్రెయిన్ షాప్సు, సదరన్ రైల్వే, మద్రాసు. బీచ్ స్టేషన్ బిల్డింగ్సు, మద్రాసు-1. 30-6-1951.

# స్త్రీ పురుషులకు సమాన వేతనాలు

## అంతర్జాతీయ కార్మిక వ్యవస్థ నిబంధన

జెనీవా, జూన్ 29: స్త్రీ పురుషులకు, సమాన వేతనాలు ఇవ్వాలన్న ఒక నిబంధనను అంతర్జాతీయ కార్మిక వ్యవస్థవారు నేడు అంగీకరించారు.

ఈ నిబంధనకు అనుకూలంగా 105 ఓట్లున్నూ, ప్రతికూలంగా 33 ఓట్లున్నూ వచ్చాయి. దక్షిణ ఆఫ్రికా నుంచి వచ్చిన ప్రతినిధులంతా వ్యతిరేకంగా ఓటు చేసారు.

కాని, ఈ నిబంధనను ఏ దేశంలో అమలుజరపాలన్నా, ముందు ఆ దేశం ప్రభుత్వం దీనిని ఆమోదించాలి.

## మహాత్ముని సోదరికి పింఛను

రాజకోట, జూన్ 29: గాంధి మహాత్ముని అక్కగారగు శ్రీమతి రాలియట్ బేన్‌కు సౌరాష్ట్రప్రభుత్వం వారు ఈ సంవత్సరం ఏప్రిల్ 1 నుండి నెలకు 100 రూపాయలు యిస్తారని యిక్కడ తెలిసింది. 84 ఏండ్ల వృద్ధగు శ్రీమతి రాలియట్ బేన్ యిప్పుడు రాజకోటలో మహాత్ముడు బాల్యంలో నివసించిన గృహంలోనే నివసించుచున్నది.

## ముస్లిములీగు నుండి రాజీనామా

కాలికటు, జూన్ 30: పి. కె. మొయిదీనుకుట్టి ఎం. ఎల్. ఎ. గారు ముస్లిములీగు శాసనసభా పార్టీ కార్యదర్శి, లీగు సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు. ముస్లిములు ఇండియాలో ప్రత్యేక రాజకీయపార్టీగ నుండుట ప్రమాదకరమని వారు ముస్లిములను హెచ్చరించారు.

# రేడియో

## జూలై 3 మంగళవారం

### విజయవాడ

ఉ॥ 7-0 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె. 7-30 మద్రాసు (ఎ) వలె. 8 నుండి 8-15 వరకు ఆంగ్లమున వా॥

మ॥ 1 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వా॥ 1-40 హిందీలో వా॥ 1-50 నుండి 2 వరకు తెలుగున వా॥ 4 నుండి 4-45 వరకు "బొమ్మరిల్లు" ఉత్సవము. దర్శకులు అదివి బాపిరాజు నిర్వాహకులు వీవీవ బాపేశ్వరరావు. టి. వి. ఎ. కృష్ణమూర్తి తొలివలుకులు వాపేరు ఆఫీందార్ పాట జందాల రాముని జోస్యం. ఆంధ్రమాత దూస్విరాణి పాటలపోటీ ఇంటాబైటా మంగళ హారతి.

సా॥ 5-30 ఎస్. అన్నపూర్ణి. ఎస్. వరవ్వతి. 6-0 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము. 6-20 గీతమంజరి (బి) 6-30 గ్రామస్థుల కార్యక్రమము మద్రాసు (బి) వలె. 7-0 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమము. 7-30 సంగీతశిక్షణ 7-45 చిత్రబాణి (బి) 8-0 ఆదిపిరాల సత్యనారాయణమూర్తి వయొలిన్. 8-20 ఎస్. అన్నపూర్ణి. ఎస్. వరవ్వతి 8-40 ఆదిపిరాల సత్యనారాయణమూర్తి. 9-0 ఆంగ్లమున వా॥ 9-15 విశ్వవిద్యాలయాల కార్యక్రమము. ఆంగ్లమున ప్రసంగము. టి. వి. ఎస్ మణి.

### మద్రాసు (ఎ)

ఉ॥ 7 స్వాగతము 7-15 తమిళమున వా॥ 7-30 కె. చొక్కలింగం 8 నుండి 8-15 వరకు ఆంగ్లమున వా॥

మ॥ 12-30 ఎస్. వి. యశోధర 1 మహిళామండలి ధీరసమీరా-అష్టపది. మరిపురావి సమావేశాలు: కుంచితకర్ణ ప్రసంగము-ఎస్. వెంకటలక్ష్మమ్మ వాద్యసంగీతము దాస్యశిక్ష-నాటిక. 1-30 ఆంగ్లమున వా॥ 1-40 హిందీలో వా॥ 1-50 ఫిల్మ్ సంగీతము (బి) 2 తమిళమున వా॥ 2-10 హిందీపాఠము (తమిళమున) 2-30 నుండి 2-45 వరకు గానమంజరి (బి) 4 నెల్లూరు ఎమ్. రామమూర్తి 4-30 నుండి 5 వరకు పాశ్చాత్య సంగీతము (బి).

సా॥ 5-30 ఎమ్. చంద్రశేఖరన్-వయొలిన్ 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము (ఆంగ్లమున) 6-20 వద్దముకై ఎస్. సుందరం 7 టి. ఎస్. బాలసుబ్రమణ్యం (బి) 7-15 తమిళమున వా॥ 7-30 తమిళమున ప్రసంగము 7-45 కె. ఎస్. వెంకట్రామయ్య. వి. త్యాగరాజన్-వయొలిన్ యుగళం. తంజావూర్ రామదాసరావు-మృదంగం 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీపాఠము 9-30 మద్రాసు (బి) వలె 10 నుండి 10-30 వరకు వాద్యసంగీతము (బి).

### మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 ఉదయగానము (బి) 7-30 నుండి 8-15 వరకు మద్రాసు (ఎ) వలె.

మ॥ 12 కార్మికుల కార్యక్రమము 12-30 మద్రాసు (ఎ) వలె 1 గీతమాలిక (బి) 1-30 ఆంగ్లమున వా॥ 1-40 ఫిల్మ్ సంగీతము (బి) 1-50 తెలుగున వా॥ 2 సారంగి-విలయ విజ్ఞానము 2-10 హిందీపాఠము 2-30 నుండి 2-45 వరకు మద్రాసు (ఎ) వలె 4 విజయవాడ వలె 4-45 నుండి 5 వరకు మద్రాసు (ఎ) వలె.

సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె 6-20 సాయంసంగీతము (బి) 6-30 గ్రామస్థుల కార్యక్రమము వ్యవసాయ గోష్ఠి నాటకపి మాట-భక్తిగేయం విశేషాలేమిటి? ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమము 7-30 విక్రమోర్వశీయమా-ప్రసంగము 7-45 మద్రాసు (ఎ) వలె 9-15 తమిళమున నాటక 9-30 వి. టి. విద్యానందం, ని. టి. సదానందం 10 నుండి 10-30 వరకు మద్రాసు (ఎ) వలె.

### హైదరాబాద్

ఉ॥ తెలుగున వా॥ 7-15 నేటి కార్యక్రమము (హిందీలో) 7-20 వి. భీమశంకరరావు 7-50 గేయమాల (బి) 8 ఆంగ్లమున వా॥ 8-15 నారాయణరావ్ తెలూకర్ 8-35 కాంతారంజని 8-50 ఇ. మాధవ 9 నుండి 9-15 వరకు ఉర్దూలో వా॥

మ॥ 12-30 భక్తవాణి (బి) 12-50 మహారాష్ట్రమున వా॥ 1 చాంద్రే (బి) 1-10 కవ్వాలు (బి) 1-30 ఆంగ్లమున వా॥ 1-40 జావళ్లు (బి) 1-50 నుండి 2 వరకు తెలుగున వా॥

సా॥ 5-30 మహిళామండలి కార్యక్రమము 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు 6-20 కాంభోజి 6-30 నారాయణరావ్ తెలూకర్ 6-45 గ్రామసీమ 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ 7-45 కన్నడమున వా॥ 8 ఉర్దూలో వా॥ 8-15 [illegible] 8-40 [illegible] 8-50 [illegible] 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥ 9-30 నుండి 10-15 వరకు పాశ్చాత్యశాస్త్రీయసంగీతము-వి. [illegible] కంఠవరావు.

# ఖగోళశాస్త్రి పరిశోధన

## ఢిల్లీ ప్రవాసాంధ్ర సభలో కె. యన్. రావుగారి ప్రసంగం

న్యూఢిల్లీ, జూన్ 29: స్థానిక ఆంధ్రసంఘంలో డీకాలని శాఖవారి యాజమాన్యాన, కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖా డిప్యూటి సలహాదారు వి. నరసింహయ్యగారి అధ్యక్షతన, యీ 24 సాయంత్రం జరిగినసభలో, డా॥ కందర్పనరసింహారావు ఎం. ఎస్. సి. (చికాగో)గారు సృష్టిని, ఖగోళశాస్త్ర పరిశోధనను గురించి ఉపన్యసించారు.

"సూర్యుని ఉపరితలమున షుమారు 6000 వేల డిగ్రీల తాపక్రమం ఉన్నది. పరిమాణం సూర్యునితో సమానమైనవి, సూర్యునికంటె, యెన్నోరెట్లు పెద్దవి, అయిన రెండు తరగతుల చుక్కలున్నవి. పెద్దవాటి ఉష్ణక్రమం 7400, 11000, 28000 డిగ్రీలుండును. అందువల్ల సూర్యుడు ఒకవిధంగా యితర నక్షత్రాలకంటె చల్లనైన నక్షత్రమని చెప్పవచ్చు." అని నరసింహారావుగారు తమ ఉపన్యాసంలో చెప్పారు.

నిర్మాణదశలో ఉన్నట్టి, అప్పుడే పుట్టినట్టి నక్షత్రాలను గురించి, గోళాలను గురించి గగనపథంలోని విచిత్ర విషయాలను నక్షత్రాల వయోపరిమితిని గురించి శాస్త్రవిద్యార్థులకే గాక సామాన్యులకుగూడ బోధపడేటట్లు విశదపరిచారు.

"ఇంతవరకూ విజ్ఞానశాస్త్రవేత్తలు చేసిన పరిశోధనలవల్ల సృష్టివిధానం స్పష్టమైనది. కాని ఆయా గోళాల గతులతో మానవకోటి జన్మస్థితి లయాలు సంబంధం కలిగి ఉంటాయని పూర్తిగా నమ్మడానికి తగిన ఆధారాలు కన్పించలేదు. మనవారు జ్యోతిషం, వేదాంతం అని తెలుపు విషయాలకు నక్షత్రాలను గూర్చి చేస్తున్న శాస్త్రపరిశోధనలకు సంబంధం ఉన్నట్లు నాకు గోచరించడం లేదు," అని రావుగారు అన్నారు.

అధ్యక్షులు డా॥ నరసింహయ్యగారు డా॥ నరసింహారావుగారిని ఆశీర్వదిస్తూ, రావుగారివంటి విద్యాధికుల చేత ఉపన్యాసా లిప్పించే యేర్పాట్లు చేయవలెనని ఆంధ్ర సంఘంవారిని హెచ్చరించారు. సంఘ కార్యదర్శి మంత్రి వాది సూర్యనారాయణగారి, కృతజ్ఞతా వందనములతో సభ ముగిసింది.

# మౌర్యులకాలంనాటి శిల్పసంపదలు

పాట్నా, జూన్ 29: మౌర్యుల కాలంనాటి శిల్పనైపుణ్యమును వేనోళ్ల చాటుచున్న అపూర్వమైన రాతి చక్రాలు యిచ్చట భూమిలో దొరికినవి. పాట్నా చిత్రవస్తు ప్రదర్శనశాల క్యూరేటరు షెరీగారు పాట్నా ఆగ్నేయభాగమునందున్న మూర్తాగంజిలో ఉపయోగంలోలేని ఒక మురుగు కాల్వను అనేకసార్లు తవ్వించగా ఈ శిల్ప విన్యాసాలు బయటబడినవి. వెలికితీసిన రాతిచక్రాలలో ఒక వజను మనుపు చేయబడిన ఇసుకరాతి చక్రాలు వాటి పైభాగమున అందమైన పద్మము, కేశాడిలైను నగ్నస్త్రీరూపములు, జంతువుల, పక్షుల బొమ్మలు కలవు. కొన్నిటి మీద తాటి చెట్ల బొమ్మలుకూడా కలవు. క్రీ॥ పూ॥ 300 శతాబ్దాలనాటి శిలాశిల్పము లన్నిటికంటె ఇవి చాలా అందముగా నున్నవని షెరీగారు చెప్పారు. ఆ ప్రదేశంలోనే ఈ రాతి చక్రాలు గాక అనేక మృణ్మయపాత్రల శకలములు గూడ కనబడినవి. ఇవి అనేక రంగులలో వున్నవి. పీటిమీదకూడ అలంకారాలు కలవు. ఇంకా కొన్ని టెర్రాకోటా పాత్రలు మున్నగునవి అచ్చట కనబడినవి.

# యుగోస్లావ్ సరిహద్దులలో సోవియట్ సైన్యముల కేంద్రీకరణ

బెల్‌గ్రేడ్, జూన్ 29: రుమేనియను అధికారులు యుగోస్లావ్ సరిహద్దు సమీప ప్రాంతాలనుండి పౌరజనమును బాహుళ్యముగా పంపివేసి వారిస్థానే హంగరీనుండి వచ్చిన సోవియటు సైనికులను కేంద్రీకరించుచున్నారని ఇచ్చటి విశ్వసనీయ వర్గాలద్వారా తెలుస్తున్నది. పౌర జనమును బాహుళ్యంగా పంపివేసే పరికరాలు అందినవని అమెరికన్ వర్గాలవారు యిక్కడ వెల్లడించారు. "ఇంకా దాదాపు 70 లక్షల డాలర్లు విలువచేసే ఆయుధ పరికరాలు యుగోస్లావియాకు అందుతవి. యుగోస్లావియా ప్రధాన సైనికాధికారి వాషింగ్టన్ లండన్ పారిసులకువెళ్లి జరిపిన సమాలోచనల ఫలితంగా అటుతరువాతి యింకా విస్తారంగా యుగోస్లావియాకు ఆయుధ పరికరాలు అందే అవకాశమున్నది" అని ఈ వర్గాలవారు చెప్పారు.

# సహకార పద్ధతిలో గనుల నిర్వహణ

కటక్, జూన్ 29: ఒరిస్సాలో గనులు సహకార పద్ధతిపై నిర్వహింపబడనున్నవి. ఇందుకుగాను పరిహారం [illegible] ముఖ్యస్థానంగా [illegible] [illegible] [illegible] ప్రభుత్వ సహాయం ఉంటుంది. భారత దేశంలో సహకార పద్ధతిలో గనులను నిర్వహించడానికి యిదే ప్రథమమును.

# భారత దేశానికి మందుల సహాయం

## ప్రముఖ బ్రిటిష్ కంపెనీల వాగ్దానము

లండన్, జూన్ 29: ఆహార పదార్థాలు తక్కువగా నుండుటవల్ల భారతదేశంలో యేర్పడిన ప్రస్తుత దుస్థితిని తొలగించడానికి తాము చేయగల సహాయమంతా చేయ 15 ప్రముఖ బ్రిటిష్ మందుల కంపెనీలవారు భారత ప్రభుత్వ ఆహార శాఖామంత్రిణి రాజకుమారి అమృతకౌరుకు వాగ్దానం చేశారు.

రాజకుమారి అమృతకౌరు, హైకమిషనరు మీనన్, కౌంటెస్ మౌంట్‌బాటన్, భారత సహాయ సంఘ యితర సభ్యులతో సహా ఈ కంపెనీల ప్రతినిధులకు స్వాగతమిచ్చి వారికి భారతదేశావసరములను వివరించి చెప్పెను. ఆమె పట్టికలో మందుల మొదటివి గానుండెను. రోగాలను నయం చేయడానికి, పుష్టికరమైన అన్నం లేకపోవడమువల్ల అర్థాన్నంవల్ల వచ్చే రోగాలను నివారించడానికి మందులు అవసరమని ఆమె తెలిపింది. కలరామందులు గ్లూకోజు, విటమిన్ టాబ్లెట్లు, పెన్సిలిన్ ఆస్పిరిన్, కంబళ్లు, బ్లీచింగ్ పౌడరు, కట్టుకట్టే గుడ్డలు మున్నగునవి అవసరమని ఆమె చెప్పింది. గొట్టం బావులు పంపితే చాలా సహాయంగా వుంటుందని గూడ ఆమె అన్నది.

# కస్తూర్బానిధి ధర్మకర్తల సమావేశం

బొంబాయి, జూన్ 29: కస్తూర్బా గాంధీ జాతీయ స్మారకనిధి ధర్మకర్తలు ఈ వేళ యిక్కడ వార్షిక సమావేశం జరిపి ఇండోర్‌లో కస్తూర్బా గ్రామంలో కట్టడాల నిర్మాణంక్రింద 6 లక్షల 45 వేల రూ. వెచ్చించడానికి నిశ్చయించారు. కార్యవర్గం సిఫార్సుచేసిన రెండు సప్లిమెంటరీ బడ్జెట్లు ఒకటి 94,916 రూ. వ్యయంతో కూడినదీ, రెండోది 12,789 వ్యయంతో కూడినదీ ఆమోదించారు.

శ్రీ. జే. దక్కర్ బాపాగారిస్థానే పార్లమెంటు స్పీకరు మావ్‌లంకర్‌గారిని నిధి అధ్యక్షుడుగా ధర్మకర్తలు ఎన్నుకున్నారు.

ఠక్కర్ బాపాగారి మృతికి సంతాపం వెలిబుచ్చుతూ సభలో ఒక తీర్మానం చేయబడింది.

1950 లో 198 మంది స్త్రీలు గ్రామసేవికలుగాను 37 మంది స్త్రీలు మంత్రసానులుగాను శిక్షణ పొందారనీ, 197 గ్రామ కేంద్రాలూ 74 ప్రసూతి ఆలయాలు, 32 కుష్ఠు వ్యాధిగ్రస్తులకు పరిచర్య ఒక ఆసుపత్రి నెలకొల్పబడినవనీ వార్షిక నివేదికలో పేర్కొనబడింది.

రాజపుతానాలోని అనాథ శరణాలయాన్ని కస్తూర్బానిధి యాజమాన్యానికి అప్పగించాలని భారత ప్రభుత్వం ఆలోచిస్తోంది. భారత ప్రభుత్వం ప్రతిపాదన ప్రకారం ఈ అనాథ శరణాలయాన్ని స్వాధీన పరుచుకొని తామే నడపటానికి నిధిధర్మకర్తలు అంగీకరించారు.

# గత 50 ఏళ్లలో ప్రపంచ జనాభా పెరుగుదల

జనీవా, జూన్ 29: గత 50 సంవత్సరాలలో ప్రపంచ జనాభా పెరిగినట్లు ప్రపంచ ఆరోగ్య సంఘం నేడిక్కడ ప్రకటించినది. 1900 లో ప్రపంచ జనాభా 155,17,00,000 1949 లో అది 237,74,00,000 అయినది.

మొత్తం 52 దేశాలలో దక్షిణ ఐర్లాండు దేశంలో మాత్రమే జనసంఖ్య తగ్గినది. ఆదేశంలో 1900 లో జనాభా 32 లక్షలు. అది 1949 లో 30లక్షలకు తగ్గినది.

ఇండియా పాకిస్తానుల జనాభా ఏకమొత్తంగా చూపబడినది. ఈ ఉభయదేశాలలో జనాభా ఇతర దేశాలలో కన్న ఎక్కువగా పెరిగినది. 1900లో 28,25,00,000 ఉన్న జనాభా 1949 లో 42,04,00,000 కు పెరిగినది.

సోవియట్ యూనియన్ లో జనాభా 7,40,00,000 ఎక్కువ అయినది, 1949లో జనాభా 14,92,00,000

అర్జెంటైనా జనాభా నూటికి 251 వంతులు (48 లక్షల నుండి 168 లక్షలకు) పెరిగినది. బ్రిటన్ జనాభా నూటికి 12½ వంతులు (379 లక్షల నుండి 5 కోట్లకు) పెరిగినది.

గత 300 సంవత్సరాలలో ప్రపంచ జనాభా 5450 లక్షలనుండి 23,774 లక్షలకు పెరిగినది.

ప్రపంచ ఆరోగ్యసంఘ స్టాటిస్టికల్ పరిశీలనశాఖాధిపతి, భారత ప్రతినిధి అయిన డాక్టర్ టి. స్వరూప్ ఈ లెక్కలు తయారుచేశారు.

# దొంగసొత్తుతో సహా 14 మంది దొంగల పట్టివేత

భద్రాచలం, జూన్ 28: 1950 మేలో రామానుజపురం, గొల్లగూడెం కత్తిగూడెం గ్రామాల్లో హైదరాబాదు కమ్యూనిస్టుల పేరట అయిదు సార్లు దొంగతనాలు చేసిన రెండు ముఠాల కోయలకు (మొత్తం 14మంది) ఈ నెల 18-వ తేదీనాడు సర్కిల్ ఇన్‌స్పెక్టరు శంకర్రావుగారు అరెస్టు చేశారు. ఈ కోయలు చర్లనాడకు చెందిన చీమలపాడు, కత్తిగూడెం వాస్తవ్యులు. [illegible] దొంగసొత్తులో [illegible] 1500 రూ. ల విలువ [illegible] పోలీసులు స్వాధీనంచేసుకొన్నారు. అందులో నగలూ, నగదూ కూడా ఉన్నాయి.

# రైల్వే పనివారి సమ్మె బెదరింపు

## కార్యరూపం దాల్చదని మంత్రి సంతానం విశ్వాసం

న్యూఢిల్లీ, జూన్ 30: "రైల్వేపనివారి సమ్మె బెదరింపు కార్యరూపం దాలుస్తుందని నేను అనుకోను. ఏదైనా ఒకవేళ సమ్మె చేయాలని పనివారు కోరుకుంటే రైల్వేలను నడుపు శక్తిసామర్థ్యములు తమకున్నవని ప్రభుత్వమువారు విశ్వసిస్తున్నారు. రాకపోకల మార్గాలకు ఆటంకం కలుగకుండా చేయుటకు ప్రభుత్వంవారు చేయగలిగినదంతా చేస్తారు. ఈ సందర్భమున రైల్వేపనివారి ఫెడరేషనుతో యింకా రాయబారాలు జరిపే అవకాశం లేదు" అని రైల్వేశాఖ స్టేట్‌మంత్రి శ్రీ కె. సంతానంగారు నేడు యిక్కడ చెప్పారు.

సమ్మె కార్యరూపం దాల్చదని మీరింత ధైర్యంగా వుండటానికి కారణమేమని అడుగగా శ్రీ సంతానంగారు ఇలా అన్నారు: "రైల్వేపనివారిలో బహుళ సంఖ్యాకులు చాలాఅసంతృప్తి చెందియున్నారని, సమ్మె చేయడం ప్రయోజనకరమని వారు తలుస్తారని నేను భావించను. 10 లక్షలమంది రైల్వేపనివారిలో 3½ లక్షల మంది మాత్రమే రైల్వేపని ఫెడరేషనులో సభ్యులై యున్నారు. సమ్మె కార్యరూపము దాల్చేయెడల వీరిలో చాలామంది సమ్మెకు అనుకూలంగా వోటుచేసి యుండినప్పటికీ సమ్మెలో చేరరు. శాస్త్రరీత్యా పనివారికి రావలసిన కరువుభత్యంలో రైల్వేబోర్డు వారు వారికి సగమిచ్చియున్నారు. 1949 సం॥ములో 10 రూపాయలు, ఇప్పుడు జీతాల కమిషను సలహాననుసరించి 5 రూపాయలు రైల్వేబోర్డువారు యిచ్చియున్నారు. 40 రూపాయల కరువుభత్యం కావలెనని పనివారు కోరుచుండగా ఎంత స్వల్పజీతం పుచ్చుకొంటున్న రైల్వే పనివానికైనను యిప్పుడు అదనంగా 30 రూపాయలు ముట్టుతుంది. ఫెడరేషనువారి కోర్కెలను అంగీకరించే స్థితిలో ప్రభుత్వంవారు లేకపోవడం చేత కరువుభత్యం విషయము నాలుగు మాసాలవరకు ఆపియుంచవలసినదని ఆర్థికశాఖ మంత్రి ఫెడరేషనువారిని కోరియుండెను. కాని రైల్వేపనివారి కోర్కె న్యాయమైనదని కొంతవరకైనా గుర్తించడం అవసరమని రైల్వేబోర్డువారు తలచుటచేత 5 రూపాయల తాత్కాలిక కరువుభత్యమును వారు మంజూరు చేశారు. ఇంకా అనేకసమస్యలపై ఫెడరేషనువారు అసంతృప్తి చెందియున్నారు. వాటిని పరిష్కర్త నిర్ణయానికి పంపవల్సిందని వారు కోరారు. సమష్టి సలహాసంఘము పరిష్కరింప వీలులేని యే సమస్యయైనా వున్న యెడల దానిని మధ్యవర్తిత్వమునకు పంపవచ్చునని ప్రభుత్వంవారు తలచుచున్నారు. ఈ సలహాసంఘము అందరి అంగీకారంతో యేర్పరుపబడి నది తగాదాలలో నున్న విషయాలనుపరిష్కరించడానికి అది యేర్పరుపబడినది. ఈ సంఘము 591 సలహాలు చేసినది. వాటిలో 557 అంగీకరింపబడినవి. 14 సలహాలు పరిశీలనలో వున్నవి. 20 అంగీకరింపబడలేదు. ఫెడరేషనువారి ఈరెండు కోర్కెలపై యింకా రాయబారాలు జరిపే అవకాశం లేదు."

## రైల్వేబోర్డు వ్యాఖ్యాత విశదీకరణ

న్యూఢిల్లీ, జూన్ 29: రైల్వే అధికారులకు, కార్మికుల మధ్య వున్న తగాదాను పరిష్కరించుకొనుట కింకా సావకాశాలు వున్నాయి. వాటిని గనుక వినియోగించుకుంటే సమ్మె జరగకుండా చూడటం కూడా సాధ్యమౌతుంది అని రైల్వేబోర్డు వ్యాఖ్యాత ఒకరు నేడు వెల్లడిచేశారు.

రైల్వే కార్మికుల ఫెడరేషన్ సమ్మె బాలెట్ యొక్క ఫలితాన్ని గణించకుండా వుండేందుకు వీలులేకపోయినా ఈ ఫెడరేషన్ సభ్యుల సంఖ్య మొత్తం కార్మికులలో సగంగూడా లేదన్న సంగతిగమనించవలసివున్నదని, కేవలం గనుక సమ్మెకు దిగితే, ఇండియన్ నేషనల్ రైల్వే పనివారిల ఫెడరేషన్ వారి సహాయంతో పని జరిగిపోగలదని ఆయన అన్నారు.

ఒకవేళ సమ్మె జరిగి అవాంతరస్థితి ఏర్పడితే, దాన్ని తట్టుకోడానికి ప్రభుత్వం ఒక పథకాన్ని తయారుచేసి వున్నదని, ఈ వ్యాఖ్యాత వెల్లడిచేశారు.

రైల్వేబోర్డువారు సమ్మె జరగదనే భావంలో వున్నారు గనుక, శాంతిభద్రతలను కాపాడేందుకు మిలిటరీ సహాయాన్ని అర్థించలేదని, అయినా రాష్ట్ర ప్రభుత్వాలకు కీలక ప్రదేశాలను, ఫ్యాక్టరీలను, కర్మాగారాలను, విద్రోహచర్యల బారినుండి రక్షించడానికి తగిన చర్యలు తీసుకోవలసిందిగా కోరడం జరిగిందని ఆయన వివరించారు.

## గిరిగారి ప్రయత్నం

శ్రీ వి. వి. గిరిగారు, రైల్వే పనివారి సమ్మె ప్రయత్నం విరమింపచేసి రైల్వేబోర్డుకు - పనివారి ఫెడరేషనుకు రాజీ కుదుర్చు విషయమున పండిత నెహ్రూగారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచున్నారు. ప్రధాని నెహ్రూ సమక్షమున ఉభయవర్గాల ప్రతినిధుల సమావేశం త్వరలో జరుగవచ్చును.

శ్రీ గిరిగారు నేడు రాత్రి తిరుచినాపల్లి, పొన్మలై ఓ.ఎ. తిరువాలి కోయంబత్తూరు పరిశ్రమల ప్రదర్శన [illegible]

# రైల్వే అభివృద్ధి కార్యక్రమం

## శ్రీ సంతానం వివరణ

### 1952-53 లో రైలుపెట్టెల కొనుగోలుకు 42 కోట్ల వ్యయం

న్యూఢిల్లీ, జూన్ 30: 1952-53 సం॥లో రైలుపెట్టెల, ఇంజన్ల కొనుగోలుకు 41 కోట్ల 78 లక్షల రూపాయలు ఖర్చయే పథకాన్ని గురించి రైల్వే స్టేట్ మంత్రి సంతానంగారు నేడిక్కడ విలేఖరుల గోష్ఠిలో వివరించారు.

ఈ కార్యక్రమాన్ని ఇటీవలనే ఆర్థిక స్థాయిసంఘం ఆమోదించినది. రైల్వేల పునర్నిర్మాణంకోసం 1951-52 లో ప్రతిపాదించబడ్డ పంచవర్ష ప్రణాళికకు ఇది సంబంధించినది.

"ఈ కార్యక్రమంకింద 227 రైలింజన్లు వివిధ రకాలకూ చెందిన రైలుపెట్టెలు 1400 తయారవుతవి. అందులో 157 ఇంజన్లు, వెయ్యికిపైగా రైలుపెట్టెలు మన దేశంలోనే తయారవుతవి. మిగిలినవి విదేశాల్లో కొనబడతవి. మొత్తం సొమ్ములో 26 కోట్ల 22 లక్షలు మన దేశంలోనూ మిగిలినది విదేశాల్లోను ఖర్చుపెట్టబడుతుంది." అని ఆయన వివరించారు.

పంచవర్ష ప్రణాళికలో ప్రతిపాదించబడ్డ 9 వేల రైలుపెట్టెలలోనూ దాదాపు 7 వేలు ఈ దేశంలోనే తయారవుతవని ఆయన తెలియజేశారు.

## స్టాఫ్ కమిటీ నివేదికపై పరిశీలన

రైల్వేలు నిలవచేసిన సామగ్రులు విపరీతంగా ఉన్నందువల్ల వాటిని తగ్గించవలెనని స్టాఫ్ కమిటీ నివేదిక చేసిన సిఫార్సులు ఆలోచించబడుతున్నవని సంతానంగారు తెలియజేశారు. (ఈ నివేదిక నిన్నటి పత్రికల్లో ప్రకటించబడినది.) రైల్వేలన్నీ మళ్లీ తమ నిలవలను పరిశీలించి జూన్ 30 వ తేదీలోగా లెక్కలను రైల్వేబోర్డుకు సమర్పించాలని ఉత్తరువు చేయబడినదనీ, ఆ లెక్కల పరిశీలన జరిగిన తరవాత రైల్వేలకు అవసరంలేని సప్లయిలను కొనడం ఆపటం జరుగుతుందని ఆయన తెలియజేశారు.

రైల్వే సమ్మెను గురించి మాట్లాడుతూ సమ్మె జరగదనే తాను వ్యక్తిగతంగా అభిప్రాయపడుతున్నట్లు ఆయన తెలియజేశారు.

## మదరాసు ప్రాంత క్రొత్త సేనాధిపతి

మేజరు జనరలు హెచ్. ఎం. మొహిటెగారు, ఎ. ఎ. రుద్రగారిస్థానే మదరాసు ఏరియా కమాండరుగా జూలయి 1 వ తేదీన చార్జీ పుచ్చుకొనిరి. వీరు పంజాబులో సతారాజిల్లాకు చెందినవారు 1926 లో సైన్యంలో చేరి, బర్మా మలయాలందు యుద్ధములలో పాల్గొన్నారు.

---

ములో ఉపన్యసించి మంగళవారం 3 తే. తిరిగి మదరాసు వస్తారు.

## గురుస్వామిగారి ప్రకటన

మదరాసు, జూను 30: రైల్వేతగవు విషయమున ప్రధానమంత్రి జోక్యం కలిగించుకొనుట ఫెడరేషనుకిష్టమే. సంప్రదింపుల ద్వారా రాజీపడుటే సనిక కార్మిక తగవుల పరిష్కారమునకు మూల సూత్రము" అని ఎస్. గురుస్వామిగారు, అ. భా. రైల్వే పనివారి ఫెడరేషను కార్యదర్శి నేడు గిరిగారి సూచనపై తమ అభిప్రాయం తెలిపిరి. ఫెడరేషను యిందుకు అంగీకరించును. ప్రభుత్వంవారు అంగీకరించి తమ సానుభూతి కబుర్లన్ని ఆచరణలో చూపెదరా? యని వారు ప్రశ్నించిరి.

గురుస్వామిగారు యింకను యిట్లు అన్నారు:- ప్రభుత్వ ప్రతినిధులు ముఖ్యంగా కార్మికమంత్రి, ఆర్థిక స్టేట్ మంత్రి గా॥ త్యాగిగార్లు రైల్వేపనివారిని బెదరించి లొంగదీయడాని కుద్దేశించే ఉపన్యాసా లిస్తున్నారు. ప్రస్తుతతగవులో ఫెడరేషను సక్రమమయిన కార్మికసంఘ పద్ధతులననుసరించుచున్నది. కనుక యిట్టిబెదరింపులకు లొంగరు. కార్మికమంత్రిగారి క్రొత్తశాసనాలు అన్ని పరిశ్రమలందు పనివారిని సమ్మెకు రెచ్చగొట్టునట్టివిగ వున్నాయి.

"ఫెడరేషను సమ్మెచేసినా, యితరులు (ట్రేడ్‌యూనియను కాంగ్రెసు పనివారు) పనిచేయుదురని రైల్వేబోర్డువారు భావించినచో సమ్మెజరిగినప్పుడు ఏ సంస్థ నిజమయినకార్మికసంస్థో ప్రపంచానికి బోధపడగలదు. సమ్మెయే నిశ్చయించినచో అన్ని రైల్వేపనివారి కార్మికసంస్థల తరపున జరిపించమనీ అనేకరైల్వే కార్మిక సంస్థలు ఫెడరేషన్ను కోరుచున్నాయి. ప్రభుత్వంతో రాజీ మార్గానపోయి సమ్మె జరుగకుండ చేయుటకే 27 నెలలనుండి ఫెడరేషను ప్రయత్నిస్తున్నది. దీని ఓర్పుకి కూడ ఒక మితియుండును. ఈ ఓర్పును బలహీనతగ నెంచరాదు. జరుగబోయే కార్యంవల్ల నిజం బయటపడును.

రైల్వే ఫెడరేషను కోర్కెలు రైల్వేల ఆర్థికస్థితిని గమనించి రూపొందించెను. రాజీకుదరనప్పుడు పరిష్కర్త విచారణకు విడిచిపెట్టమనియే వేలకొలది రైల్వేపనివారు కోరుచున్నారు. రైల్వేమంత్రిత్వం యిచ్చిన [illegible] ప్రకటనలు చేసే ఒకరింపు అదంతా అపరిష్కర్త విచారణకు ముందు తెలుపుట ఉచితమనును" అని గురుస్వామిగారన్నారు.

# బట్టల ఎగుమతి

## లైసెన్సులకు వెంటనే దరఖాస్తులు పెట్టవచ్చు

బొంబాయి, జూన్ 30: పాకిస్తాను, ఆఫ్‌గనిస్తాను, ఇండోనీసియాలకంటే అన్యమైన గమ్యస్థానాలకు బట్టలు ఎగుమతిచేయడానికి వెంటనే దరఖాస్తులు పంపుకోవచ్చునని ఎగుమతుల డెప్యూటీ చీఫ్ కంట్రోలరు నేడు ప్రకటించెను.

1951 సం॥ జూన్‌తో ప్రారంభమగు అర్ధసంవత్సరానికి 19 కోట్ల గజాలగుడ్డ ఎగుమతిచేయు స్కీముక్రింద 'అల్లాట్‌మెంటుపత్రాలు' పుచ్చుకొన్న కోటాదారులు నేటినుండి 15 రోజుల లోపుగా ఈ 'అల్లాట్‌మెంటు పత్రాల'లో నిర్దేశించిన బట్టలో మూడవ భాగానికి దరఖాస్తును పెట్టుకోవచ్చును. ఈ మూడవభాగాన్ని వారు ముతక, మధ్యరకము, సన్నని, అతి సన్నని బట్ట ఎగుమతికి 25.8 దామాషాను ఉపయోగించాలి. పాకిస్తాన్, ఆఫ్‌గనిస్తాన్, ఇండోనీసియా కోటాలు యింకను పూర్తిగా వినియోగింపబడ నప్పటికీ ఈ లైసెన్సులను జారీచేస్తారు. ఈ మూడుదేశాల కోటాలు పూర్తిగా అయిపోయేటంతవరకు 'ఇతర గమ్యస్థానములు' అను శీర్షిక క్రింద అల్లాట్‌మెంట్లు చేయరని రెండుమాసాలక్రిందట ఎగుమతుల డెప్యూటీ చీఫ్ కంట్రోలరు ప్రకటించియుండెను.

ఏడెన్, హాంకాంగ్ జిబౌటి, మలయా (సింగపూరుతోసహా)లకు లైసెన్సులివ్వరు. కాని ఈమొత్తమును పాకిస్తాన్, ఆఫ్‌గనిస్తాను ఇండోనీసియాలకు ఉపయోగించుటకు ఎట్టిఆక్షేపణా వుండదు.

## మిల్లుబట్టల పరిశ్రమ విషయమై విచారణ

నాగపూరు, జూన్ 30: దేశమందలి బట్టల మిల్లుల పరిస్థితులను పరిశీలించడానికి భారత ప్రభుత్వం నియమించిన సంఘమువారు తమ రెండురోజుల విచారణను నేడు యిచ్చట సమాప్తంచేశారు. ఈ రెండురోజులలో వారు మిల్లు యజమానుల ప్రతినిధులతోను, కార్మికుల ప్రతినిధులతోను, రాష్ట్రీయ ప్రభుత్వ ప్రతినిధులతోను, ప్రత్తివర్తకుల ప్రతినిధులతోను వివిధ విషయాలు చర్చించారు. మిల్లులయందలి కార్మికుల పరిస్థితి; మిల్లుల పునరుద్ధరణ, విస్తరణ; కంట్రోళ్లవల్ల మిల్లుబట్టల పరిశ్రమకు కలిగిన లాభనష్టాలు; తగినపత్తి, కత్తిలేని ప్రత్తినిల్వలను లభ్యమగు అవకాశము మున్నగు విషయాలను వారు చర్చించారు. మధ్యప్రదేశ్ లో ప్రత్తి హెచ్చుగా పండించే అవకాశాన్ని గూర్చియు, ప్రత్తిని కల్తీచేయకుండా చేసేందుకు అవసరమైన చర్యలను గూర్చియు సంఘంవారు రాష్ట్రీయ ప్రభుత్వ ప్రతినిధులతో ప్రత్యేకంగా చర్చించారు.

ఈ సంఘము జూలై 10 న బొంబాయిలో సమావేశమై అటుతరువాత అహమ్మదాబాదు, సౌరాష్ట్ర ఢిల్లీ, కాన్‌పూరు, బహుశః ఇండూర్లను దర్శిస్తారు. ఆగస్టులో భారత ప్రభుత్వం వారికి నివేదిక సమర్పిస్తారు.

---

మొదటిలైను బీచిలో ప్రభుత్వ గిడ్డంగిలో శుక్రవారంరాత్రి దొంగలు గోడ దూకి వచ్చి బియ్యం దొంగిలించేరు.

# జనరల్ ఎన్నికలు

## పార్టీగుర్తుల నిర్ణయం

మదరాసు, జూలై 1: జనరల్ ఎన్నికల ఏర్పాట్లు ముఖ్యంగా రాజకీయ పార్టీల సంకేతములు గురించి చర్చించుటకు శ్రీ గోపాలరెడ్డిగారు సమావేశపరచిన సమావేశానికి షుమారు 17 రాజకీయపార్టీల ప్రతినిధులు హాజరయ్యారు. సమావేశానికి ఎన్నికల మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహించారు.

రంగుపెట్టెలకు బదులు సంకేతములను వాడుటకు సమావేశమైనవారు సుముఖంగా వున్నట్లు తెలిసింది. రాజకీయ పక్షాలకు నిర్ణయించి ఖాయపరచిన చిహ్నమును తెల్లరంగుమీద నలుపురంగుతో ముద్రించి బాలెటు పెట్టెకు అంటించెదరు. ఒకవేళ ఆ కాగితము ఊడిపోయినను చిక్కులేకుండా పైన అంటించిన చిహ్నమునే పెట్టెలోపలకూ దావుంచుతారు.

పార్లమెంటు అసెంబ్లీ ఎన్నికలు రెంటికీకూడా ప్రతిపార్టీకి ఒకేరకమైన చిహ్నం వుండాలని కూడా సభవారు అభిప్రాయపడ్డారు. రిజర్వు స్థానముల విషయములో పార్టీచిహ్నము మీద అడ్డంగా ఒక నల్ల గీత గీసెదరు. ఒకేచిహ్నం కావాలని రెండుపార్టీలు కోరిన లాటరీవేసి నిర్ణయించెదరు.

సమావేశంలో పాల్గొన్న ఈ క్రింద ఉదహరించిన పార్టీలు బ్రాకెటులో ఇచ్చిన చిహ్నము కోరుచున్నారు:

కాంగ్రెసుపార్టీ (రెండు ఎద్దులు కట్టిన నాగలి) ప్రజాపార్టీ (ఏనుగు) డెమొక్రటిక్ పార్టీ (కాగడా) తమిళనాడు సోషలిస్టుపార్టీ (ఎద్దులు కట్టని నాగలి) వెనుకబడినజాతుల లీగు (గుర్రం) తమిళనాడు షెడ్యూలు జాతుల ఫెడరేషన్ (గుడిసె) సోషలిస్టుపార్టీ (పళ్లచక్రము నాగలి లేక చెట్టు) ఆలిండియారిపబ్లికన్‌పార్టీ (పళ్లచక్రము, ధాన్యపుకంకి) ముస్లింలీగు (లాంతరు) ఫార్వర్డుబ్లాక్ (ఉరకబోతున్న పులి) యునైటెడ్ సోషలిస్టు ఫ్రంటు (నక్షత్రం) కమ్యూనిస్టుపార్టీ (సుత్తీ కొడవలి) జస్టిస్ పార్టీ (త్రాసు) కామన్‌వెల్ పార్టీ (ఏనుగ లేక గొడుగు) తమిళనాడు ఓటర్ల పార్టీ (కుడిచేతితో పొట్టను చూపుతున్న అస్థిపంజరం) హిందూమహాసభ (కోడి) ఆలిండియా అగ్రికల్చరిస్టు యూనియన్ (నాగలి ధాన్యపుకంకి.)

రాజకీయ పార్టీలు వెల్లడించిన అభిప్రాయాలు, సూచనలు, కోరిన సంకేతములు ఎన్నికల కమిషన్ వారికి పంపెదరు.

అభ్యర్థులకు ఆయాపార్టీల వారు తమని ధృవపత్రము వుండాలనీకూడా ప్రతినిధులు అంగీకరించారు. పోలింగుకు "ఖ్యూ" పద్ధతి అనుసరించుటకు గూడా ఒప్పుకున్నారు.

సమావేశాంతమున శ్రీ గోపాలరెడ్డిగారు రాజకీయపార్టీల ప్రతినిధులకు వందనము లర్పించారు.

## గోడల్లో సారా సీసాలు

మదరాసు, జూన్ 30: చింతాద్రిపేటలో ఒక యింటియందు గోడలకు కన్నాలుచేసి సారా సీసాలుంచి పైకి కనబడకుండా కొలందర్లు వాటిని పెట్టేరు. పోలీసులు వాటినితీసి ఇద్దరువారిని ఒకపురుషుని అరెస్టుచేశారు.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika P.
No. 7, Thambu Chetty Street, Madras.